

జోడు

—ఫొటో : డి. వి. ఎస్. ఎస్. ఎస్. సోమయాజులు, కాకినాడ.

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతి 4 అ.



# సచిత్రవారపత్రిక

Founder K. NAGESWARA RAO

సంపుటము 48
సంచిక 14
1-12-54

జయ మార్గశీర్ష శుద్ధ షష్ఠి బుధవారం

ముందుకు సాగని కలం

ఫొటో: ఎస్. రామేశ్వరరావు—రాజమండ్రి.

## విషయానుక్రమణిక

ముఖచిత్రం: — విజయా వారి "మిస్సమ్మ" లో సావిత్రి.



### గమనిక

17-11-54 ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రికలో ప్రచురింపబడిన "డాక్టరు భీమశంకరంగారి పరిశోధన" అను కథకు మూలం నెథానియల్ హాతారన్ అని పాఠకులు గ్రహింపవలసినదిగా ప్రార్థన.



# కాలక్షేపం

తెలియక నాశహేతువగు
తీవ్రతరానల కీలలోపలన్
శలభము చొచ్చుగాక; మతి
చాలక మీనము గాలపుంగొనం
గల పిశితంబు తా మెసగు
గాక; యెఱింగియు మేము దుఃఖదో
హాల వనితాసుఖంబు విడ
నాడము మోహ మహత్వ మెట్టిదో.

తా॥ మిడుత తన నాశనమునకు కారణభూతమైన దారుణమగు దీపాగ్ని జ్వాలలోనికి, ఆ సంగతి తెలియక, ప్రవేశించుగాక - గాలముయొక్క కొనయందు వ్రేలాడుచున్న ఎరను అనగా మాంసపుముక్కను చూచి, బుద్ధితక్కువచేత, చేప దానిని మ్రింగునుగాక -. కాని, మనుష్యులమైన మేము కష్టనష్టములను బాగుగా తెలిసినవారమైయుండియు, దుఃఖకారణమైన స్త్రీలతోకూడిన సంసారసుఖమును విడనాడుట లేదు. మోహముయొక్క మహాత్వము ఎటువంటిదోకదా!

ఒకదానికి కారణభూతమైనది ఇంకొకటి ఉన్నదని ఊహించడం మనకు స్వభావసిద్ధమైన మన స్తత్వం. దీనినే వేదాంతులు కార్యకారణసంబంధంఅన్నారు. పాశ్చాత్య భౌతిక శాస్త్రవేత్తలుకూడా ప్రమేయంలేని ఫలితంఉండదని సిద్ధాంతీకరించారు. "నిప్పు లేకపోతే పొగ ఎట్లా వస్తుంది?" అనేటటువంటి ఒక్క మాటలో పొగచుట్టవలె ప్రపంచ పరివర్తనార హాస్యసూత్రం అంతా చుట్ట చుట్టబడి ఇమిడిఉన్నదన్నారు. నిప్పు లేకపోతే పొగ ఏవిధంగా సంభవింపదో, అదేవిధంగా విత్తు లేనిదే చెట్టు ఉండదు. అదేవిధంగా ఏదో ఒక కారణంలేనిదే ఏదో ఒక ఫలితం ఉండదు. దానినే తిరగవేసి తల్లక్రిందులుగా చెప్పవలెనంటే, ఏదో ఒక ఫలితం కనిపిస్తున్నదంటే, ఏదోఒక కారణం దానికి ఉన్నదని ఊహించవలసినదే. అలాఊహించలేకపోతే అది మన అసమర్థత - అదిమన అప్రయోజకత్వం-అంతేగాని, ఫలితమునకు ప్రమేయ ఉండకమానదు. ఇంట్లో సొత్తుపోయిందంటే, దానిని ఎవరో ఎత్తుకొనిపోయి ఉంటారు. ఫలానివారి పిల్లవాడు ఫలానివారి పోలికను ఉన్నాడని ఏ విధంగా నిర్ణయిస్తామో, అదేవిధంగా ఫలానా ఫలితానికి ఫలానా కారణం ఉండక తప్పదని ఊహిస్తాము. సొత్తు ఎత్తుకొనిపోయిన చోరుడెవడో కనిపట్టలేకపోవచ్చు. కాని, ఒక చోరుడు చోరతచేసి, ముచ్చవలె చొచ్చి లోనికివచ్చి, సంగ్రహించినందువల్లనే మన కీగ్రహచారంపట్టి వెండి బంగారం గైర్హాజరీ అయినదని అంచనా వేసి ఊహించక తప్పదు. మొన్న నీమధ్య జపానులో రేడియోశక్తి పూరితమైన వర్షం కురిసినదన్నారు. జపాను శాస్త్రవేత్తలు యిదంతా ఎందుచేత సంభవించింది? అని తర్కించారు. తర్జన భర్జన చేశారు. మధించారు. శోధించారు. చిట్టచివరకు వారి బుద్ధికితోచిన విషయం ఏమిటంటే, ఉత్తరధృవప్రాంతములో ఎక్కడో ఎవరికీ తెలియని ఏ ఎడారిలోనో రష్యావారు హైడ్రోజన్ బాంబులను పేల్చి ఉంటారనిన్నీ, అటువంటి హైడ్రోజన్ బాంబు ప్రేలియుండుటవల్లనే జపానుప్రాంతములో యీ రేడియో శక్తియుక్త వర్షపాతము సంభవించినదనిన్నీ నిర్ణయించారు. నిర్వచించారు. కాని, స్పష్టంగా నిరూపించలేదు. నిర్ధారణ చేయలేదు. అయితే, ఉదజనిబాంబు (హైడ్రోజను బాంబు) ప్రేలితే ప్రేలియుండవచ్చు. ప్రేలకపోతే, ఇదంతా జపాను శాస్త్రజ్ఞుల ప్రేలుడు కావచ్చు. వట్టి అనుమాన ప్రమాణ పరికల్పనప్రలాపన కావచ్చు.

ఈమధ్య ప్రపంచంలో అనేక నగరాలలో అర్ధరాత్రివేళ ఆకాశంలో వింత వింత రంగులుగల విష్ణుచక్రాలు కన్పించుచున్నవనే వార్తలు కొన్ని పత్రికలలో కన్పించుచున్నవి. అవి పెద్దపళ్ళెములవలె పైన

ఇంకా ఉంది

ఎగురుచున్న వన్నారు. పెద్దపెద్ద పళ్ళెములు ఆకాశములో దేదీప్యమానంగా ఎగురుచున్నప్పుడు, అంత పెద్ద పళ్ళెములను ఎవరు విసరివేస్తున్నారనే సంశయం మన హృదయాకాశంలో ఎగురుతూ గిరగిర తిరుగుతూ ఉన్నది. అంగారకగ్రహంనుంచి యీ పళ్ళెములను విసరి పారవేస్తూఉండవచ్చునని కొందరు అనుమానించారు. కాని, అందరికీ యీ అంగారక సిద్ధాంతం అంగీకారం కాలేదు. ఎందుకు విసరివేస్తున్నారని ప్రశ్న వేస్తే, దానికి కారకులగు అంగారకవాసులు ఏ వైనమూ చెప్పక మౌనము వహించవచ్చు. ఈమధ్య అంగారక గ్రహంనుంచి ఇద్దరు యువతులు ఒక దీవిలో అవతరించారనిన్నీ, వారు సాక్షాత్తు అంగారాంగనలే (అగ్గి నిప్పువంటి ఆడవాళ్ళే) అనిన్నీ వాఙ్మూలమిచ్చి అఫిడవిట్టు ధాఖలుచేయుటకు తయారుగా ఉన్నానని ఫ్రాన్సు దేశంలో ఒక పెద్దమనిషి బల్లగుద్ది వాదించాడట. బహుశః పైనుండి అంగారక గ్రహంనుండి క్రిందకు భూమిమీదకు పడినట్లుగా అతడు వివరించిన పడతులు అతడు వరించిన పతితలు కావచ్చు. ఏమైనప్పటికీ, యీ కాలంలో ఈ ఆటం బాంబుల కాలంలో ఏ రోజున ఏ వింత విపరీతం సంభవించినా సంభవించవచ్చునన్నట్లుగా ఉంది.

వింత అంటే ఏమిటి? కారణం సుంతే తెలియని సమయంలో నిర్ఘాంతపోయి, ఉద్భ్రాంతిపాలవుతాము. లేదా అంతులేని వింతపాలవుతాము. అదేవింత. జగత్తుఅంతా గమ్మత్తుగా కన్పించేది ఎప్పుడు అంటే, కించిత్తుకూడా మనకు సత్తు ఏదో అసత్తు ఏదో తెలియనప్పుడు. అంటే, అర్థం ఏమిటంటే మనకు కార్యకారణసంబంధం తెలియనప్పుడు, మన కది తెలియకపోవడమే మనకు ఆశ్చర్యం. మనకు తెలియలేదనే విషయమై మనం "హా!" అని మూర్ఛిల్లి, తెలివితప్పి పడిపోవచ్చు - మన తెలివితక్కువను మనమే గ్రహించి, మనం తెలిసికొనలేకపోవుటనుగూర్చి మనమే విస్మయమయులం అవుతున్నాము. కాబట్టి మన తెలివి అల్పమనెడి అనల్పమైన ఆశ్చర్యం పొందినవాళ్ళమవుతున్నాము. ఇంతకూ మనకు వింత కలిగించేది మన అల్పజ్ఞత్వం, మన అజ్ఞత్వం - మన కించిజ్ఞత్వం, మానవులకు వింత కలిగించేది మానవుని అజ్ఞానమే కాని మరొకటి కాదు. తన అజ్ఞానమును తాను గ్రహించినప్పుడే అమితమైన ఆశ్చర్యం కలుగుతుంది. మన అజ్ఞానమే మన ఆశ్చర్యంగా వెల్లడి అవుతోంది. ఇంతకూ చెప్పవచ్చిందేమిటంటే, మన ఆశ్చర్యానికి మన అజ్ఞానం కారణం కాదు- ఆశ్చర్యపడుట అనేపనికి (అనేకార్యానికి) మన అజ్ఞానం అనేది కారణంకాదు - ఆశ్చర్యమే అజ్ఞానం - అజ్ఞానమే ఆశ్చర్యం - ఎడమచేతికీ పురచేతికీ భేదంలేదు. పిల్లపుట్టిన కారణంచేత ఇల్లాలు తల్లి అయినదనుమాట నిజమే. "తల్లి" అనుమాటలోనే "బిడ్డలుగలది" అనేఅర్థం ఇమిడిఉంది. ఆమె "తల్లి" అగుటకు "బిడ్డ" పుట్టుట కారణమా? బిడ్డ పుట్టుటకు తల్లి కారణమా? ఈవిధమైన మథనం చేస్తే, యీ విధమైన శోధనచేస్తే, విత్తుకు చెట్టు కారణమా? చెట్టుకు విత్తు కారణమా? అనే తర్కంతో మొగము మొత్తినట్లవుతుంది. అందుకనే యీ సృష్టికి అంతటికీ మూలకారణం ఏదో ఎన్నియుగాలు తర్కించినా అంతు చిక్కదన్నారు. మనిషి అనేవాడు కోతిలోనుంచి వచ్చాడన్నారు. కోతి అనేది కుక్కలోనుంచి వచ్చిందన్నారు. కుక్క అనేది కప్పలోనుంచి వచ్చినదన్నారు. యీ విధంగా క్రమపరిణామవాదంలో ప్రశ్నపరంపరలు వేస్తూనే తర్కశాస్త్రాన్ని పండితులు కదం త్రొక్కించారు. ఇదంతా పాశ్చాత్యపండితులు సాగించిన శాస్త్ర శోధన విధానం. మన పూర్వీకులు కూడా యీదేవిధంగా తర్కరథం నడిపించారు. భూమివంటి ఘనపదార్థం ఎట్లా వచ్చిందన్నారు? నీరువంటి ద్రవపదార్థం గడ్డకట్టితే, భూమివంటి ఘనపదార్థం వచ్చిందన్నారు. ద్రవపదార్థం ఎక్కడినుంచి వచ్చిందంటే, వాయుపదార్థం చల్లబడితే,

# ★ కాలక్షేపం ★

నీరువంటి జలపదార్థం వచ్చిందన్నారు. వాయుపదార్థం ఎక్కడినుంచి వచ్చిందన్నారు? ఆకాశమువంటి (ఆంగ్లభాషలో "యీథర్"అనబడేటటువంటితత్వమునుంచి వచ్చిందన్నారు. అది ఎందులోనుంచివచ్చిందంటే, ఏదో ఒక తేజశ్శక్తిలోనుంచి ఎలెక్ట్రిసిటీ (విద్యుచ్ఛక్తివంటి శక్తి) లోనుంచి ఉద్భవించినదన్నారు. పాశ్చాత్య పండితులుకూడా అణువులలోనూ, పరమాణువులలోనూ 'ఎలెక్ట్రానులు' (విద్యుత్ అంశలు అనబడేవి) ఉన్నవని వాదిస్తున్నారు. ఈ విధంగా తేజస్సు అనబడేది ఒకమూలపదార్థం అనిన్నీ, ఆ తేజస్సు అనబడే భూతము అనగా తేజస్సు అనే మూలధాతువులోనుంచి యీ జడ జగత్తు అంతా ఆవిర్భవించినదనిన్నీ వాదిస్తున్నారు.

ఇదంతా అనగా అనగా, వినగా, వినగా మనకు సందేహ సందోహం మనదేహం విడిచిపెట్టకుండా యింకా వెంటబడుతూనే ఉంది. అయితే, ఆ తేజస్సు ఎక్కడనుంచి వచ్చింది, దేనిలోనుంచి వచ్చింది? అని శిష్యుడు అడిగితే, "నోరుముయ్!" అన్నాడు గురువు. షట్ కర్మనిరతుడై, షట్‌శాస్త్ర పారంగతుడైన గురువుగారు "ఒరే శిష్యా! ఇంతకంటే నీకు నేను యీ విషయంలో చెప్పేది ఏమీ లేదు. · గనుక *Shut up* (షటప్) ఇక "ముయ్ నోరు!" (*Shut*) షట్!" అంటే, ఉపనిషట్ కూడా అంతే. కలకత్తానుంచి బయలుదేరిన మెయిలుబండి మద్రాసు సెంట్రలు స్టేషనుకు చేరిన తర్వాత ఇంకా ఎక్కడికి వెళ్లుతుంది? అని అడగడం బుద్ధితక్కువ. దేశం అంతా తిరుగుటకుగాని, అన్ని రైలుమార్గాలమీదనూ తిరుగుటకుగాని, ఒక్కటే పెద్ద బైరాగి టిక్కట్టుకొని, రైలులోఎక్కి ఆ బైరాగి టిక్కట్టుతో పూర్ణయాత్రచేసే బైరాగి సంసారి అయినప్పటికిన్నీ, మద్రాసు సెంట్రలుస్టేషనులో రైలు ఆగినప్పుడు అక్కడ మూటముల్లె చంకను బెట్టి సవ్యంగా సరసంగా దిగకపోతే "*Get down!*" (గెట్ డౌన్!) దిగిపో! అని తలతిక్కదిగిపోయేటట్లుగా రైల్వే అధికారులు పహిల్వాన్ అయినా "బహిర్ జావ్!" అంటారు. అటువంటి సందర్భంలో "తేజస్సు" ఎందులోనుంచి పుట్టిందని శిష్యుడు ప్రశ్నిస్తే, గురువు ఊరుకుంటాడా? ఆ శిష్యుడు తన అంతేవాసిఅయినా నీకు చెప్పేది అంతే అంటాడు. తేజస్సుకు కారణభూతమైన భూతం ఏదీలేదు అంటాడు. పంచభూతాల సంగతి వివరించి, ప్రపంచం అంతా ఈ పంచభూత ప్రణాళికలోనే ఉన్నదని ఉపదేశించి, పంచను చింపితే వచ్చినదే గోచీ అని గోచరింపజేసి, గోచీకి కారణభూతం పంచ అని వచించి, పంచకుపైన మనబుద్ధి ఇకపోదని వాదించితే, గోచీధరించిన శిష్య బ్రహ్మచారికి ఆ తత్వ విచారం అంతటితో అంతం అయిపోతుందా?

పంచభూతాత్మకమైనది యీ జగత్తు అని చెప్పితే కించిత్తు ప్రయోజనంలేదు. ఈ పంచభూతాలు దేనిలోనుంచి వచ్చాయి అనే ప్రశ్న గుచ్చిగుచ్చి అడుగక మానరు: కనుక యీ తెలిసీ తెలియని కొంటె కుంటి గ్రుడ్డి ఎడ్డి వెర్రి తొర్రి పరిణామవాదంచేసి కొమ్ములు తిరిగిన పండితుడననుచు, "కరిభంగి సర్వమున్ తెలిసితి నంచు" విర్రవీగడం కంటె, మూలకారణం ఆయూకీ తెలియదని మౌనం వహించడం మంచిది గనుక "నోరుముయ్!" అని గురువుపై శిష్యుడు సవాలు చేస్తాడు.

యాతావాతా, పర్యవసానం ఏమిటంటే, సృష్టిపర్యవసానం మనకు తెలియదు. సృష్టి అవసానమూ తెలియదు. సృష్టి ఆరంభమూ తెలియదు. కనుక, ఈ సృష్టి, యీ జగత్తు ఎక్కడనుంచి వచ్చిందో దాని మొదలు చెప్పలేము. ఇది చివరకు ఏమవుతుందో చెప్పలేము. అందువల్ల ఇది తుదిమొదలు తెలియనిదిది. ఆద్యంత రహితమైనది. అందుకనే "ఆదిమధ్యాంత రహితా!" అని జగత్కర్తకు, అనగా ఆ జగత్కారణునకు ఒక్క నమస్కారంచేసి, ఆ మూలకారణమును గూర్చిన వాదం చాలించి అభివాదం చేయడం ఆర్యలక్షణం అన్నారు.

కార్యం ఏమిటి? కారణం ఏమిటి? చెట్టులోనే ఉంది విత్తు - విత్తులోనే ఉంది చెట్టు. ఆ విషయం చెప్పడానికే శ్రీకృష్ణ భగవానునిఅంతవాడు తీరిక చేసికొని వేదాంత శాస్త్రంలో కొన్ని ఉపన్యాసాలు చెప్పి, భగవద్గీత అనే గ్రంథం రచించి, డా॥ శ్రీకృష్ణ యాదవ, (డాక్టర్ ఆఫ్ ఫిలాసఫీ) "వేదాంత వేత్త" అనే బిరుదుపొంది, సంసారులను యీ సంసారం అనే బురదలోనుంచి ఉద్ధరించాడు. "కొట్టేవాడు ఎవడు? కొట్టబడేది ఏమిటి?" అంతా ఒకటే అన్నాడు. "శ్రీమద్రమారమణ గోవిందో హరిః!" భరించేవాడు ఎవడు? భరింపబడేది ఏమిటి? రెండూఒక్కటే.ఒక్కటే రెండు భిన్నరూపాలలో ఉన్నదన్నాడు. భరించేవాడు "భర్త." భరింపబడేది "భార్య" శ్రీకృష్ణ భగవానుల వారి సిద్ధాంతంప్రకారంగా రెండూ ఒక్కటే అన్నారు. కార్యం అనేది ఒకటిన్నీ, కారణం అనేది ఇంకొకటిన్నీ వేర్వేరు విషయాలు కావన్నారు.

"బంగారువంటి కోమటి
సంగీతముచేత బేరసారము లుడిగెన్"

అంటే ఏమైనా అర్థం ఉన్నదా? "బంగారంవంటి శెట్టిని సంగీతం చెడగొట్టింది"అంటే, అందుకు కారణం సంగీతం అని వాదించినట్లయింది. శెట్టిది కాదు తప్పు అని చెప్పినట్లవుతుంది. ఆ లెక్కను వస్తే, భోగము మేళమువంక చూడడంవల్ల శెట్టిగారి అబ్బాయి, లెక్కలు తప్పులు వ్రాయవచ్చు - దానికి కారణం భోగంవాళ్లా? బంగారంవంటి శెట్టిగారి కుమారుని శృంగారభావవికాసవిలాసావేశమా? తప్పటడుగులు వేసెడి పిల్లవాడు గుమ్మముతగిలి బోర్లగిలపడితే, తల్లి అది చూచి, "లేదులే నాయనా! పాడుగడప నిన్ను క్రింద పడవేసిందా! అన్నా! నీవుమాఅబ్బాయినిఎందుకు పడగొట్టాలి?" అని ఆగ్రహం నటించి ఆ గడపను రెండు దెబ్బలు కొట్టితే, అప్పుడు ఆ బాలుడు, ఆ బాలగోపాలకృష్ణునివంటి పసివాడు, ముసిముసి నవ్వులునవ్వుతూ, చెంతనున్న యశోదవంటి తల్లి ఒడిలోనికి చేరగలడు. పిల్లవాడు క్రిందపడుటకు గడప కారణం అంటేనేగాని, ఆ పిల్లవానికి తృప్తి కలుగదు. ఇటువంటి అజ్ఞానమునకే ఆగోపాలకృష్ణుడు నవ్వినాడు. ఆ గోపాలకృష్ణుని నవ్వులో అంత పరమార్థం ఉంది. అట్టి నవ్వులోని ఆ పరమార్థమే మనలను సుజ్ఞానులను గాచేసి రక్షించుగాక! ఈ కృష్ణ పరమాత్మతత్వంలో, ఈ కృష్ణ కర్ణామృత సారంలో, స్త్రీకి పురుషుడు దుఃఖకారణం కాడు. పురుషునకు స్త్రీ దుఃఖకారణం కాదు. నీకు నీవే కారణం. నీకు నీవే కార్యం- కార్యంలోనే కారణం ఉంది. కారణంలోనే కార్యంవుంది. "దుఃఖదోహల వనితా సుఖంబు విడనాడుము" అనేమాటను విడనాడితేనే గాని, ఆత్మస్వాతంత్ర్యం లేదని వాదించినవాడే కృష్ణభగవాన్. యోగ్యమైన వైరాగ్యం ఏ విధంగా లభిస్తుందంటే, స్త్రీని పురుషుడు విడిచిపెట్టడంవల్లనూ కాదు. పురుషుని స్త్రీ విడిచిపెట్టడంవల్లనూ కాదు. పరస్పర చిరాకుల, పరాకుల, విడాకులవల్లనూ కాదు. సంసారమును విడనాడుటవల్లకాదు. "దుఃఖదోహల వనితా సుఖంబు విడనాడుము" అనే వ్యర్థస్పర్థ వాక్యార్థమును విడనాడుట వల్లనే. ★

# హానోయ్ విశేషాలు: 4

## 7. ఇంటా బయటా!

ఊళ్ళో యే యిల్లు చూసినా, వీధి అరుగు అంటూ కనిపించదు— పెద్ద భవనాలు మొదలుకొని సామాన్యపు కొంపలవరకూను. బంగాళాలూ, భవంతులూ తప్పిస్తే మామూలు యిళ్లకి రోడ్డుమీదకి వరండా కూడా ఉండదు. ఇళ్లు కట్టడంలో మూడు నాలుగు తరహాలు. పాతబంగాళాలూ భవంతులూ అన్నీ యూరపుదేశంలో వాటిలాగ అవుపిస్తాయి; కొన్ని కొన్ని చీనాదేశపువాటిలాగ ఉంటాయి. ఇంకా కొన్ని యిటీవల కట్టినవి రీఇన్‌ఫోర్స్డు కాంక్రీటువి అమెరికనుపద్ధతిని అనుకరిస్తాయి. ఇందులో కూడా మూడువొంతులు ఫ్రెంచివారి ప్రాబల్యం కనుపిస్తుంది.

ఇంక, సామాన్యుల యింటిలోకి వెళితే అంతా యించుమించుగా మనవేపులాగే ఉంటుంది. వొంటింట్లోకి వెళ్ళేను. మనవేపులాగ పొయ్యి (మట్టితో వేసినది) లేదు; అలాగని కుంపటికాదు. అసలు బొగ్గుల కుంపటి వీళ్లకి తెలియదు. మట్టిపొయ్యికి బదులుగా ముక్కోణంగా ఒక యినపగజం వొంచి ఉంటుంది; దానికి మూడు కాళ్లున్నా, ఆ కాళ్లమీద నిలబడితే భూమికి బెత్తెడు ఎత్తుకన్నా ఉండదు. అయితే వొంటిల్లు పొయ్యివేసుకున్నచోట అంతా మట్టి! పొయ్యి పాతినచోటకాస్త లోతుగా తవ్వి వుల్లల్లో ఒండుకుంటారు వీళ్లు! మనలాగే పీటమీద కూచుని వంటింట్లో పనులు చేసుకుంటారుగాని ఆ పీట రెండు బెత్తెలుకన్నా వెడల్పు ఉండదు. కూరా నారా తరుక్కోడానికి అచ్చంగా మనవేపులాంటిదే కత్తిపీట. ఇంక బియ్యంకడుగు బుట్టా, చేటా, జల్లెడా,— చీపురుకట్ట సమేతం—మనం వాడుకున్నట్టే వాడుకుంటారు. వాళ్ల వంటిళ్ళూ మన వొంటిళ్లలాగే పితపితలాడుతూ ఉంటాయి. ఊఁ నీళ్ల వాడకం మూలాన్ని వొంటింట్లోకి జోళ్లతో వెళ్లవొచ్చును. పాంకోళ్లు అయితే మరీ!! వొంటిల్లు యింట్లో వెనకకి మనవేపులాగే ఉన్నా, భోజనాలుమాత్రం వీధివేపు గదిలోనే చేస్తారు. కొన్ని కొన్ని పెద్ద భవనాల్లో డ్రాయింగురూమూ, డైనింగుహాలూ అని ప్రత్యేకించి ఉన్నా డైనింగుహాలు వొంటింటి పరిసరాల్లో మాత్రం ఉండదు.

ఇంటినిబట్టీ తగిన మండువా ఒకటి ఉంటుంది. అందులో ముఖ్యంగా కనిపించేవి రెండు వొస్తువులు (i) పెద్దనీళ్ల కుండి; (ii) బుద్ధుడు. నీళ్లకుండీలోకి నీళ్లు చూర్లమ్మట ప్రవహిస్తాయి, వానపడ్డప్పుడు. (ఇక్కడ విపరీతపు వానలు!) చూరమ్మటే సీనారేకు దొన్నె వుంటుంది. ఓమూలనుంచి దానిని కిందికి దింపి, గొట్టాంకట్టి యీ నీళ్ల కుండిలోకి వొదిలేస్తారు. బాగా ఓ అరగంటో గంటో వానపడి, చూర్లమ్మటా పెంకుల్లోనూ ఉన్న దుమ్ము గిమ్ము అంతా కొట్టుకొనిపోయింతరవాత, యీ కుండిలోకి నీళ్లు పడతారు. కొళాయి నీళ్లకన్నా యీ నీళ్లు ఎక్కువప్రీతితో వాడుకుంటారు. పల్లెటూళ్లో నూతినీళ్లు వాడతారు. అయితే అవి చపటా కట్టిన నూతులూ కావు; నేల నూతులూ కావు. నూతిగట్టు ఓ అడుగు ఎత్తున ఉంటుంది. కైవారం చాలా చిన్నది. ఆగట్టున అటోకాలూ యిటోకాలూ వేసి నుంచుని తోడుకుంటారు నీళ్లు!

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

**క్రొవ్విడి లక్ష్మన్న**

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

బుద్ధుడి విగ్రహం ఓ గోడని గూట్లో ఉంటుంది. సామాన్యంగా యిళ్ళల్లో కనపడే యీ బుద్ధవిగ్రహానికీ అసలు బుద్ధమూర్తికీ ఏమీ పోలిక ఉండదు. రాతిబొమ్మ మాత్రం ఖాయం, - మనవేపు కొయ్యబొమ్మ గోలి పిల్లి అమ్మవారైపోయినట్టు! అదే యింటి దేవుడు. మన యిళ్ళల్లో మహాలక్ష్మిపీట ఉన్నట్టు, ప్రతీ వియట్‌నామీజ్ యింట్లోనూ యీ బుద్ధుడు ఉంటాడు. అయితే మనవేపులాగ వీళ్లు యీ దేవుడికి ప్రతీరోజూ పూజ చెయ్యరు. ప్రతీనెలా (వీళ్ల పంచాంగంప్రకారం. వీళ్లదీ చాంద్రమానంలెఖ్ఖ) ఒకటో తేదీని పదిహేనో తేదీని పూజ చేస్తారు. అంతమందీ ఒక్కసారి పూజ చెయ్యడానికి వీల్లేదు. ముందుగా తండ్రో తాతో యింటికి పెద్దయెవరయితే వారు, దేవుడి ముందు నుంచుని చేతులు జోడించి ముందుకి వొంగి నమస్కారంచేసి ప్రార్థన చేస్తాడు. ఊదొత్తి వెలిగిస్తాడు. పూజకి పువ్వులు ఉండాలన్న బాధలేదు. చేసే పూజ - అంటే పూజ చేసేటప్పుడు అనే ముక్కలు నోట్లో అనుకోవలసిందే కాని, పైకి అనడానికి వీల్లేదు. ఇలాగ ఆయన పూజచేసిన తరువాత పెద్దకొడుకూ, తరవాత రెండోవాడూ అలాగ్గా వొచ్చి ఎవరిమట్టుకు వాళ్లు దైవధ్యానం చేస్తారు.

ఈ దేవుడు యిలా ఉండగా డ్రాయింగ్ రూంలో ఇంకోటి యిలాంటిదే కనిపిస్తుంది. అది కేవలం దేవుడుకాదు కాని, దానికి పూజా పునస్కారాలూ అదీ జరుగుతూ ఉంటాయి. అది పితృదేవతలని ఉంచే చోటు, *Family altan* అంటారు. ఇందాకా చెప్పిన బుద్ధదేవుడికన్నా యిది నిజంగా చాలా బాగుంటుంది చూడ్డానికి. ఇంటినిబట్టీ, కుటుంబపు ఆర్థికపరిస్థితులనిబట్టీ మంచి చిలవలూ, పలవలూతో పనివాడితనం ఉట్టిపడుతూ ఓ "పాలవెల్లి" లాంటిది లక్కతో కడతారు. దానిమీద నగిషీ చెక్కిన లతలూ, తీగెలూ, పువ్వులూ, కాయలూ, చెట్లూ, పక్షులూ, మృగాలూ అన్నీ వాటి వాటి రంగులతో జిగజిగ మెరుస్తూ ఎంతో బావుంటుంది. ఆ పాలవెల్లిలో మధ్యగా ఒక రెండుమూడు అంగుళాలు వెడల్పూ, ఒకటిన్నరా రెండడుగుల పొడుగూ ఉన్న దంతపుపలక ఉంటుంది. ఆ పలకమీద ముత్తాతా, ముత్తవ్వ పేర్లదాకా చీనాభాషలో (మనకి సంస్కృతంలాగ వీళ్లకి చీనాభాషంటే ఎంతో గౌరవం!) చెక్కి ఉంటాయి. ఆ పలకకి అటూ యిటూ తాత అమ్మమ్మల ఫోటోలు ఉంటాయి. దీని పంపిణీ ఏమిటీ అంటే తండ్రి గతించేసరికి తాత అమ్మమ్మలపేర్లు ఆ పలకమీద ఉన్న లిస్టులో జమఅయిపోయి, యీ గతించిన తండ్రీ తల్లీ ఫోటోలు వాటి స్థానం ఆక్రమిస్తాయి. ఈ పనిజరిగే ముందు కొంత తంతు కూడా ఉంది. కుటుంబానికి చెందినవాళ్ళూ, కావలసినవాళ్లూ పదిమందీ పోగయి "మీ ముత్తాత తాత ఫలానాఫలానా మంచి పనులు చేసి కీర్తి సంపాదించుకున్నాడు. మీ ముత్తాత ఆయన అడుగుజాడల్లోనే నడిచి ఫలానా ఫలానా ఘనకార్యాలు చేసేడు. మీ తాత ఆ సంప్రదాయానికి బద్ధుడై ఫలానా మోస్తరుగా పైకి వొచ్చేడు. మీరుకూడా ఆవిధంగా కుటుంబమర్యాదల్ని, ఆనవాయితీల్ని నిలబెట్టి గౌరవం సంపాదించుకోవాలి. ఆప్రకారం పెద్దవాళ్ళు కమ్మని వారి ఆశీస్సులడగండి" అని చెప్తాడు, అందరిలోకి తల నెరిసినవాడు. ఈ పలకకి యింకో ఉపయోగంకూడా ఉంది. పిల్లాడికి గాని పిల్లకి గాని నామకరణం చేసినప్పుడు గత ఏడు తరాల్లోనూ ఉన్న పేరు పెట్టడానికి ఎంత మాత్రం వీల్లేదు. అందుకని అప్పుడు యీ పలకమీద పేర్లన్నీ యింకోసారి చదివి తైపారువేసుకుని, అంతవరకూ లిస్టులోకి ఎక్కని పేరు ఏదో పెడతారుట!

## 8. ఆచారాలు

వీళ్ళకి కార్తిక, మార్గశిర మాసాలు పెళ్లి ముహూర్తాలకి రోజులు. అయితే మనలో



# హానోయ్ విశేషాలు



లాగ ఆడపిల్లల తల్లిదండ్రులు ఊః అరాటపడి వరుణ్ణి వెతుక్కో నవసరంలేదు. ఇక్కడ ఆచారం వరుడే వధువుని వెతుక్కుంటాడు. పెళ్లి పెళ్లికొడుకుయింట్లోనే జరుగుతుంది! మిగతా కట్నాలూ లాంఛనాలూ అవీ పేర్లు మార్పు గాని అంతా మన మోస్తరే.

ఇహ చావూ పుట్టుకలు చూస్తే, మొగపిల్లాడు గనక పుట్టినట్టయితే యింట్లో వేడుకా, విందూను. ఆడపిల్ల గనక అయిందా, ఏమీ లేదు! కాని చదువుసంధ్యల్లోనూ వాట్లోనూ మొగాడెంతో ఆడదీ అంతే. ఏమాత్రం తేడా లేదు. ఈభోగట్టా యిక్కడ స్త్రీలగురించి రాసినప్పుడు యింకా విస్తరించి మనవిచేస్తాను.

చచ్చిపోయిన తరవాత మనుషుల్ని పాతిపెడతారు వీళ్లు. మొదటో ఓసారి పాతిపెట్టి తరవాత ముప్ఫైయ్యోరోజున మళ్లీ ఆ అస్థికలు వాటినీ తీసియింకోచోట మళ్లీ పాతిపెట్టి దానిమీద గోరీ కడతారు. ఈ గోరీలు కిరస్తానువాళ్ళ గోరీల్లాగనూ ఉండవు; తురకవాళ్ల గోరీల్లాగనూ ఉండవు. శివాలయంలో పానవట్టం ఒక్కటీ యింకా పొడిగించి కడితే ఎలాగుంటుందో అలాగుంటుంది వాళ్ల గోరీ. మధ్యలో మట్టి, అందులో చిన్న చిన్న పువ్వుల మొక్కలున్నూ. "తద్దినా"లంటూ వీళ్లకి లేవుకాని, ఆరోజున కావలసిన వాళ్ళు నలుగురూ ఒకచోట పోగయి, ఆ పోయినమనిషి ఆత్మశాంతికోసం ప్రార్థన చేస్తారు; తరవాత గోరీదగ్గిరకి వెళ్ళి ఊదొత్తులు వెలిగిస్తారు. మనిషిని పాతిపెట్టినప్పుడూ, రెండోసారి మళ్ళీ భూస్థాపితం చేసినప్పుడూ కూడా, అంటే రెండుమాట్లూ, ఆ జాగా ఫలానా యిన్ని పియాస్ట్రిలకీ అని కొనుక్కోవాలి. గోరీ కట్టించడం ఖర్చు యెలాగా భరిస్తారు అనుకోండి.

పెళ్లికానివాళ్లు (ఆడది అయినాసరే, మగవాడయినాసరే) పోయినట్టయినా, తెల్లటి రంగు వేసిన గుర్రబ్బగ్గీలో, తెల్లటి పెట్టిలో పెట్టి, తెల్లటి గుర్రాన్ని పూంచి, దానిమీద తెల్లటి దుప్పటిలాంటి బట్ట కప్పి తీసుకు వెళతారు. జీవికి ఏవిధమైన సంసార పాపం గాని దుఃఖం గాని అంటకుండా నిర్మలంగా ఉంది అనుకోడానికి. పెళ్ళి అయినవాళ్లు గానీ పోయినట్టయినా, పై సరంజాం అంతా నల్లరంగులో ఉంటుంది. మనిషి పోయిన యింటికి, పన్నెండో నాటి వరకూ నల్లగుడ్డ వేలాడగడతారు. ఏ యింట్లోనయినా, ఏ దుకాణంమీద నయినా చూరునుంచి వేలాడుతూ నల్లగుడ్డకానీ కనిపిస్తే ఆ యింట్లో కొద్దిరోజులక్రితం ఎవరో పోయినారని నిస్సందేహంగా అనుకోవచ్చు.

## 9. నమ్మకాలూ-సామెతలూ

ఇంక ఒకట రెండు మాటలు వీళ్ల నమ్మకాలూ వాటిగురించి రాస్తాను మనలాగే వీళ్లకి పిచ్చినమ్మకాలు చాలా ఉన్నాయి. అద్దం గనక బద్దలకొడితే వొళ్లమాలిన ముప్పుట కొంపకి! చేపలపులుసు గిన్నె గానీ చెయ్యి జారి కిందపడితే చెడ్డ ప్రమాదం యింటిల్లిపాదికిన్నీ. బోణీ బేరంగాని చెడిపోతే యిహను ఆరోజల్లా మరి బేరాలుండవు. మొదట కొనకుండా వెళ్ళిపోయినవాడిదృష్టి యింక ఆ దుకాణంమీదే ఉండి మరెవ్వరినీ రాకుండా చేస్తుందిట. అందుకని బోణీ బేరం గనక చెడిపోతే; వెంటనే ఓ కాగితం ముక్క నులిమి చుట్టలాగచుట్టి వెలిగించి దుకాణంమీద సరుకులచుట్టూ మూడుసార్లు తిప్పుతారు - యీపొగ కాస్తా ఆ పాడు దృష్టిని తోలేస్తుందని! ఏదైనా పనిమీద వెళుతూన్నప్పుడు గుమ్మం దిగడంతోటే స్త్రీ కనక ఎదురయిందా భగ్నంపాడే. ముసలివాడు ఎదురుపడితే ఠక్కున పని జరుగుతుంది. కుక్క గానీ యెదురుగావొస్తే అంతకన్నా శుభం మరిలేదు! పంచాంగం తప్పకుండా వొంటింట్లో ఉండాలి (దాని మీద చీనా అక్షరాలు ఉంటాయి మరి!)

ఇంక వీళ్లకి వంటింటి వేలుపు ఒకడున్నాడు. వాడి పర్వదినం డిసెంబరు 27 న జరుగుతుంది. ఏడాది పొడుగునా ఆ దేవుడు వొంటింట్లో కూచుని యింట్లో ప్రతీ వాడూ యెవడు యేపనిచేసింది చిట్టా రాసుకుంటాడు. వాడికి వాహనం చేప. 27 డిసెంబరు ఉదయాన్నే ఆవాహనంఎక్కి తిన్నగా స్వర్గానికి పోయి, వీళ్ల పుణ్య - పాప కార్యాల లిస్టు అక్కడ దాఖలుచేసి వొస్తాడు. అంచేత యీ దేవుణ్ణి చాలా భక్తితో పూజిస్తారు యీ దేశస్థులు. డిసెంబరు 27 న ఉదయాన్నే మాంచిచేప ఒహాటి బజార్లో కొనుక్కునివొచ్చి దేవుడిముందు ఉంచుతారు, యింకా తెల్లవారకుండాను. ఎంత మంచిచేప అయితే అంత మంచి వాహనం; వాహనం మంచిదయితే దేవుడు సంతోషిస్తాడు. వాడుసంతోషించడంకన్న కావలసింది ఏం వుంది? అదీపంపిణీ!!

వీళ్ళ సామెతలుకూడా చాలా చమత్కారంగా ఉంటాయి. మాటవరసకి: (1) "కన్నీళ్లు ఎప్పుడూ కిందికేగాని మీదికి జార"వంటారు, తల్లిదండ్రులకి పిల్లలమీదుండే అభిమానం, పిల్లలకి తల్లిదండ్రులమీద ఉండదని. వృద్ధాప్యంలో తల్లిదండ్రులని పిల్లలు విధిగా పోషించాలని వీళ్ల ఆచారం. ఎవ్వడైనా అన్యథా ప్రవర్తిస్తే వాణ్ణిగురించి అనుకుంటూ "అవునవును. కన్నీళ్లు కిందికేగాని మీదికి జార"వంటారు. (2) కొడుక్కి తండ్రి యింటికప్పులాంటివాడు - తండ్రికన్నా యింకో ఆసరా యెవ్వడూ ఉండడని చెప్పరావడం. (3) "పండు తిన్నప్పుడు చెట్టు నాటిన వాణ్ణి తలుచుకోవాలి" - మేలు మరిచిపోకూడదని అర్థం. (4) అన్నం నమిలి మింగాలి; మాట ఆలోచించి ఆడాలి - తొందరపాటు కూడదన్న సందర్భంలో.

(ఇంకా వుంది)

# సీత చూసిన చూపు

అపరాహ్ణ సమయం దాటింది. వెంకమ్మ వంటింట్లో సతమతమవుతున్న సమయంలోనే, పక్కింటి గంగారత్నం వంటింటి గుమ్మందగ్గర నిలబడి ఏమి వూదిందో గాని వార్పుకు వచ్చిన అన్నం సంగతికూడా ఆలోచించకుండా, ఆమె సావిట్లోకి పోయి అరుగుమీద దస్తావేజులు రాస్తూన్న భర్త కుటుంబయ్య నుద్దేశించి:

"విన్నారా! ఒకమారు రండి" అంది. కుటుంబయ్యకు యీ కేకలో ఆజ్ఞ స్ఫురించింది గావల్ను, కళ్లజోడు చాపమీద పెట్టి ఆదరాబాదరా లోపలికి పోయాడు.

"ఏమిటే గొడవ. అవతల పెద్దమనుష్యులు నుంచున్నారు" అన్నాడు విసుగుతో. వెంకమ్మగారి నోరు వస్తుతహా చెడ్డదని గ్రామంలో ఒక వాక్యం వుంది. ఆమె ఒక్కసారి విదిలించుకొని "చావనీండి. అవతల కొంపలుపోతున్నాయి. సీతికి పెళ్లిచూపులట" అంది. కుటుంబయ్య ఆ మాటలోని భావం పూర్తిగా గ్రహించలేకపోయాడు.

"ఇహ నేం మనకి వొరిగింది. పప్పుకూడు దొరుకుతుందన్నమాట. ఈ కబురు కోసమేనా పొలికేకలు పెట్టావు" అంటూనే వెనక్కి తిరిగాడు.

"అంతే మన ప్రయోజకత్వం. వాళ్ళు వూరేగుతుంటే నీ కూతుర్ని తీసికెళ్ళి సీతి వళ్ళో దికేయ్. ఛీ! సిగ్గంటేగా మానాభిమానాలు లేని జన్మలకి."

కుటుంబయ్య యిక కదల్లేకపోయాడు. సంగతి అతనికి పూర్తిగా తెలిసింది.

"అయితే ఏం చెయ్యమంటావు? చూడలేకపోతే కృష్ణలో దిగు" అన్నాడు సగం బిక్కుబిక్కుమంటూనే.

వెంకమ్మ తెగేదాకా లాగే స్వభావం గలది. ఈ అవకాశం ఎంతమాత్రం చెయ్యిజారనివ్వకూడదనుకొంది. పైకొచ్చే ఆగ్రహాన్ని అదిమిపట్టి సాధ్యమైనంత మృదువుగానే అంది.

"మీరు పోయి ఆ విషయమేమిటో తేల్చుకు రండి."

కుటుంబయ్య వ్యవహారాల్లో అందెవేసిన చెయ్యి. ఇంతకంటె విసమర్చి అతగాడికి చెప్పనక్కర్లేదు కూడాను. అదీగాక. తన



లక్ష్మీం క్షీరసముద్ర రాజతనయాం శ్రీరంగ ధామేశ్వరిం

ఫొటో: వి. జె. సుందర్—బొంబాయి.

# ★ సీత చూసిన చూపు ★

కూతురు లక్ష్మి, తమ్ముడి కూతురు సీతకంటె రెండేళ్లు పెద్దది. ఈ పరిస్థితులలో సీతా కల్యాణం తన అసమర్థతమీద ఎంత దెబ్బ తీస్తుందో, లక్ష్మి భవితవ్యాన్ని ఎలా మార్చేస్తుందో అతను భార్యకన్న ఎక్కువగానే గుర్తించాడు. అందుకనే కండువా పైన వేసుకొని చరచరా వాకిట్లోకి నడిచాడు.

"అర్జంటుపని ఒకటుంది - సాయంత్రం రావయ్యా రెడ్డెమ్మా" అంటూనే పోయి అల్లంత దూరంలో వున్న నిద్రగన్నేరు చెట్టుకింద చతికిలపడ్డాడు.

కుటుంబయ్య తండ్రి పోయి పదిహేనేళ్లయింది. అన్నా తమ్ముడూ భోజనవిషయంలో మనస్పర్థలు కలిగి మద్రాసు వెళ్ళి రావలసిన అవసరం కలిగింది. ఆ తరువాత పదేళ్ళవరకూ ఆ రెండు కుటుంబాలూ ఒకరి గడప ఒకరు తొక్కలేదు. దరిమిలా కుటుంబయ్య తల్లిపోవటంతో మళ్ళీ రాకపోకలు సాగినయ్. అయినా యిప్పుడు తమ్ముడింటికి పోవటం కార్యకూరుడి లక్షణం కాదనుకున్నాడు.

ఇంతలో మునసబు వీరారెడ్డి అటు రానే వచ్చాడు. కుటుంబయ్య ఆ సమయంలో అక్కడ కూర్చోటం అతనికి వింతగానే కనపడ్డది.

"ఏవయ్యోయ్. అలిగి కూకుండావల్లే వుందే! తమ్మయ్య కబురంపలా" అన్నాడు నోట్లో చుట్టతీసి. కుటుంబయ్య అడ్డంగా తలూపి "నేను కాబట్టి యింకా పట్టుకు ఏడుస్తున్నాను. వాడికేం ఏనాడో తెంచుకున్నాడు" అన్నాడు.

వీరారెడ్డికి సంగతి అర్థమైంది. ఆ కాస్తకీ తన తెలివితేటలు జతపరచి—

"అహా! అల్లా అనమాకు. ఇంట్లో పెళ్లీడు వచ్చిన పిల్లుండగా చిన్నబుచ్చుకొంటావని పూరుకొన్నాడు. అంతేగాని మంచోడేలే" అంటూనే మళ్లీ అందుకొని.

"ఇంతకీ నీ పప్పన్నాలు ఎప్పుడయ్యా" ఒకమారు పకిలించి, మీసం తిప్పుకుంటూ సాగిపోయాడు.

"విధవలు - యిట్టే పసిగడతారు" అనుకున్నాడు కుటుంబయ్య. వీరారెడ్డి కనపడ్డ వలుగురితోనూ కుటుంబయ్య నిస్సంగత్వాన్ని చెప్పి యింత ఎండఎక్కిన తరువాత, పెళ్లివారు వచ్చేదారిలో అతను కూర్చోటానికి హేతువేమిటో అతి చాకచక్యంగా వ్యాఖ్యానించాడు కూడా.

"విధవలు - యిట్టే పసిగడతారు" అనుకుంటూనే కుటుంబయ్య లేచి నిలబడ్డాడు. కండువాతీసి, తుప్పున వుమ్మేస్తూనే దులిపి పైన వేసుకున్నాడు. ఒక్కక్షణం అక్కడ ఆగి యిటూ అటూ చూసి వెనక్కి తిరిగి అర మైలు దూరంలోవున్న కారు ష్టాండుకేసి నడిచిపోయాడు.

చూపులకి వచ్చిన ముగ్గురూ, అంటే పెళ్లికొడుకుతో చేర్చి, కారుష్టాండుకు చేరుకొనేటప్పటికి యింకో అరగంట అయింది. తమ్మయ్యగాని మరెవరుగానీ, వీరిని సాగనంపటానికి, యింతదూరం ఎండలో రారని కుటుంబయ్య వేసిన అంచనా తప్పలేదు.

ఇంకా కారు షెడ్డులోంచి రాలేదు. ఆ ముగ్గురూ సోడాషాపు దగ్గర బల్లమీద కూర్చున్నారు. పెళ్ళికొడుకు "పత్రిక" తిరగేస్తున్నాడు.

"పిల్లవాడు బాగానే వున్నాడు" అనుకున్నాడు కుటుంబయ్య. "సీతి మొగుడు అందగాడే" అనే మరోమాట చెవుల్లో మారుమ్రోగింది.

మెల్లిగా వారి ప్రక్కకు చేరి "ఏవూరండీ తమది" అన్నాడు. అందులో కళ్లజోడు పెట్టుకున్నాయన జవాబిచ్చాడు. "గుడివాడ - మీదీ?"

"ఈవూరే, బంధువులింటికి వచ్చారా."

"ఒకమాదిరి - కాబోయే బంధువులు అదే శివరామయ్యగారింటికి."

"ఒహో పెళ్ళిచూపులా - కట్నం ఏమాత్రం."

"ఇరవైఆరూ, లాంఛనాలూ. మీది ఈ వూరే అన్నారు గదూ; వారి వంశమర్యాదలూ అవీ" చెప్పమన్నట్టుగా చూశాడు. కుటుంబయ్య పెదవి విరచి చప్పరించాడు. ఆపైన నిరాశగా ఆకాశంలోకి చూస్తూ "వంశమర్యాదలకేం - దొడ్డవే. పిల్ల తాత గొప్ప కర్మిష్ఠి" అని పూరుకున్నాడు.

"తమ అంతర్యం గ్రహించలేదు. ఏదో అనుమానిస్తున్నారల్లే వుంది." పిల్ల సంగతో–" పెళ్ళికొడుకు ఒకమారు తలెత్తి కుటుంబయ్యవంక చూచి తల దించుకున్నాడు. చూడగా పిల్ల నచ్చలేదనీ, వత్తిడి బల్ల లొంగాడనీ అనుకున్నాడు కుటుంబయ్య.

"ఒకచాయ మీ అబ్బాయే ఎక్కువ" పెళ్ళికొడుకు వేపు చూస్తూ అన్నాడు.

"అది సరే - మేము చూసిన సంగతేగా."

"ఇహనేం - ఇక అన్ని విషయాల్లోనూ దివ్యంగా వుంటుంది. కానీ."

"కానీ—" ముగ్గురూ శ్రద్ధగా చూశారు కుటుంబయ్య వంక.

"మరేం లేదు - చాలా అర్భకురాలు - ఈమధ్యే కాలవగట్టుకుపోయి పడిపోయిందన్నారు! వాటికేం లెండి పెళ్లవగానే అవే పోతయ్." చాలా సాదాగా అన్నాడు కుటుంబయ్య.

"చెప్పారూ! అంటే మూర్ఛలన్నమాటే" రెండో ఆయన తొందరగా అడిగాడు.

"మూర్ఛలా! మరి అదేమో. పిల్ల అర్భకురాలూ అంటాను."

మెల్లిగా లేచి శలవు తీసుకొని పోతూనే దారిలో వెంకటేశ్వర్లుని కేకేసి కారు ష్టాండు వేపు పరిగెత్తించాడు.

* * *

"మా కా రా! ఏమనుకుంటున్నారో అంతానూ" రమణమ్మ భర్తతో అంది.

"అనుకోనీ. లోకులు కాకులు - ఆ వీరారెడ్డి చెప్పేదాంట్లో ముప్పాతికో అబద్ధాలే"

"ఇదేం సత్తెకాలపు మనుషులండీ! లక్ష్మికి లగ్గాలు పెట్టుకుంటున్నారు, వూళ్లో అయితే వుమ్మేస్తారని బావమరిది యింట్లో చేస్తారుట పెళ్ళి. ఇటు మనకా జవాబు రాకపోయే. ఇంకేం కావాలండీ నిదర్శనాలూ" నిలవదీసి అడిగింది ఆమె.

శివరామయ్య తలపట్టుకొని మెల్లిగా అన్నాడు.

"ఇంత భరవాసా యిచ్చారే - ఏం వొచ్చింది యింతలో."

ఇంతలో అటువచ్చింది సీత. దాన్ని చూడగానే కౌగలించుకొని ఆవురుమన్నది తల్లి.

శివరామయ్యకు వాస్తవంగా బుఱ్ఱ తిరిగింది. ఆ విసురులో పోయి అన్నగారిమీద పడవలసిందేగాని - నిద్రగన్నేరు చెట్టుదాకా పోయి ఏమాలోచించుకున్నాడో ఏమోగాని వెనక్కి తిరిగి వీరారెడ్డి అరుగు మీదికిపోయి కూర్చున్నాడు.

ఈతంతు జరిగిన వారంరోజులికి కుటుంబయ్య శుభలేఖయిచ్చి పిలవనూ పిలిచాడు. శివరామయ్య ఏమీ అనకుండానే ఆహ్వానాన్ని స్వీకరించాడు. రమణమ్మ పసేమీ రానంది. శివరామయ్య ముందు కొప్పడ్డా తరువాత తనవల్లగాక "ఇక్కడే తగులడు - నలుగురూ వుమ్మేస్తారు" అన్నాడు.

"నావల్లగాదు ఆ దిక్కుమాలిన పెళ్ళి చూట్టం - వురేసుకు చావనన్నా చస్తాగాని. అంత ఆప్యాయం తగలబడితే మీరు పోయి సంతోషించండి."

ఒకనాడు మహాశివుడు కాలకూటాన్ని దిగమ్రింగటం చరిత్రలో ఒక అపూర్వ ఘట్టమే. ఇంత అవమానాన్ని శివరామయ్య జీర్ణించుకొని పెళ్ళికి వెళ్లాలని ఎల్లా తీర్మానించుకున్నాడో తెలుసుకోటం కష్టమే. ఈ విషయంలో శివరామయ్యకు యింతకంటె విశిష్టమైన స్థానమే దొరకాల్సింది.

"ఆ పెద్దమనిషి - నా మొహం చూస్తానే యీ పెళ్ళి విందులు సంతోషంగా ఎల్లా అనుభవిస్తాడో చూస్తాను. కుటుంబయ్య తన ఎదుటే కూతురు కన్యాదానం మనశ్శాంతితో ఎలా చేస్తాడో చూస్తాను. నేనక్కడ మాట్లాడకుండా కూర్చోటమే వాళ్ళ సంతోషాన్నీ, మనశ్శాంతినీ కలుషితం చేయగలిగినప్పుడు నాకు యిప్పుడు జరిగిన అవమానం కేవలం అమృతతుల్యమే. అందుకుగాను సీతనుకూడా తీసుకుపోవాలె." ఇది శివరామయ్య నిర్ణయం. శిక్షాస్మృతులు అనేకవిధాలు. శివరామయ్య తనూ కూతురూ పెళ్లికి వెళ్లటంవల్ల అటు వుభయపక్షాలకీ ఒకవిధంగా మానసిక శిక్షే పని ఒకకొత్త 'పీనల్ లా' నిర్మించుకొని తన భార్యకాదన్నా సీతను తీసుకొని పెళ్ళికి బందరు వెళ్ళాడు. ఆనాడే రవణమ్మ వాకిట వుందని వూరంతా అనుకున్నారు.

*    *    *

పెళ్ళివారెవరూ శివరామయ్య వచ్చినందుకు సంతోషించలేదు. పైగా సీత సరాసరిపోయి లక్ష్మినే అంటిపెట్టుకొనివుండటం వెంకమ్మకు మరీ కారం రాచుకున్నట్లయింది. అన్యాపదేశంగా నాలుగయిదుసార్లు చీదరించుకుంది కూడాను. కుటుంబయ్య ప్రపంచానికి దడిసి తమ్ముడికికూడా పసుపు కుంకుమ(?)... పురమాయిస్తూనేవున్నాడుగాని డబ్బుపెత్తనమంతా బావమరిదిచేతులోనే వుంది. సీత వింటూండగానే వెంకమ్మ తనవాళ్లతో పెళ్ళికొడుకునుగురించి ఎంతో ఘనంగా చెప్పుకుంటోంది. అతగాడు బి. ఎ. ఫస్టున పాసయాడుట. ఆరుఎకరాలభూమి, పెద్ద లోగిలీ అదీనూ - శెలవులు అవగానే అతను డాక్టరీ కెడతాడుట.

"లక్ష్మి అదృష్టమే, అదృష్టం. అది అందరికీ రాదేవ్ కొంతమ్మపిన్నీ. దేనికైనా పెట్టిపుట్టాలె. అదృష్టంకొద్దీ బిడ్డ నోము కొద్దీ పురుషుడూను - పాడు మొహాలకేం అనేకముందును" అన్న మాటలు సీతా వింది. "రవణమ్మేదే అక్కా" అని ఎవరో అమ్మలక్కలు అడగనూ అడిగారు.

"ఏవోనమ్మా, ఒక్కగానొక్క కూతురు. ఇంతకార్యం చేసుకుంటుంటే ఎక్కడున్నా పదిరోజులుముందేవచ్చి ఆసరా అవుతారు. ఆవిడగారు వాకిటుందిట. వీరేమో మగపెళ్ళివారులా యివాళే దిగారు. అయినా కొంతా - వుంటారుసుమా, లోకంలో వోర్వలేనివాళ్ళు కూడాను" అని బుగ్గలు నొక్కుకోటుంకూడా సీత చూసింది. చాటుగా తండ్రితో చెప్పింది. అతను ఎక్కువగా మాట్లాడక "ఈ ఒక్కరోజు సహించుతల్లీ - డబ్బుకు గడ్డితిన్నాడు ముండాకొడుకు" అన్నాడు.

కన్యాదానం జరిగిపోయింది. ఒకపక్క తెర పట్టుకున్నది శివరామయ్యే. పెళ్ళికొడుకు తలెత్తి లక్ష్మివంక చూశాడు. ఆతరువాత అతని దృష్టి ఒక వలయాకృతిగా తిరిగి సీతమీద పడగానే ఒక్కక్షణం ఆగి యిష్టంలేకపోయినా వెనక్కి తిరిగాయి. సీత తనవంకే చూస్తోంది. ఆ చూపులు అతని హృదయంలోకి చొచ్చుకుపోయి దేనికో వెదుకుతున్నయ్.

"సీత ఎంత అందంగావుందీ" క్షణికమైన ఒక వూహ మనసులో మెరిసింది. "అప్పటి కన్నా - ఒక్క నెలలోనే ఎంత మారింది." ఒక సందేహమనే మబ్బుతునక తన కళ్ళ ముందుగా పరుగెత్తింది. "లక్ష్మికన్నా." ఒకసారి కళ్ళెత్తి లక్ష్మిని చూశాడు. ఆరోజున ఎందుకనో అతనికి లక్ష్మికన్నా రెండేళ్లు చిన్నదయిన సీతే ఆకర్షణీయంగా కనపడింది. ఆమె కళ్లల్లోని చిలిపితనం, తన్నేదో కాసిస్తున్నట్లుగా వుంది. లక్ష్మి చూపులు నునుసిగ్గుతో వంగిపోతున్నాయి. వాటిల్లో కాంతి వుందిగాని - సీత చూపుల్లోని విద్యుత్ప్రవాహాలు లేవు. ప్రేమ వుందిగాని - ఆకర్షణ తగ్గింది. రెండో వారి చూపులో లాలసత్వమూ ఆకర్షణా రెండూ వున్నయి.

మంగళహారతి పాడటం సీతవంతుకు వచ్చింది. ఆమె జార్జెట్ చీర మడతల్ని సరిచేసుకుంటూ యిద్దరికీ మధ్య నిలబడింది. "సంధ్యా సమయం - యమునా తీరం" అని ఆమె మనోహరంగా పాడుతూ అతనివంక కళ్ళ అంచుల్లోనుంచి చూస్తూ ఒలికించిన దరహాసం అతని హృదయాన్ని ఒక్కసారి వూపి మరో రాజ్యంలోకి లాక్కుపోయింది. శరీరమంతా చల్లబడిపోయింది. అట్టి అనుభూతి అతనికి తలంబ్రాలు పోసుకునేటప్పుడు కూడా కలగలేదు. ఆ చిరునవ్వు యమునాతీరంనుండి; శరద్రాత్రి వెన్నెలతో కలసివచ్చే మలయమారుతంలా అనిపించింది. అతను అప్పుడు మోహనమురళీ రాగంలో మునిగిన గోపాలుడే అయ్యాడు. దంపతులిద్దరూ పీటమీదనుంచి లేచారు బ్రహ్మముళ్లతో.

పెళ్ళిపందిరి అంతా గొల్లుమన్నది. ఆ కోలాహలంలో శివరామయ్య పరుగెత్తుకుపోయి పెళ్ళికూతురు లక్ష్మిని అతి కష్టంమీద నిలబెట్టాడు. పెళ్ళికొడుకు నోటినుంచి నురగలు వస్తున్నాయి. కాళ్లూ చేతులూ భీకరంగా కొట్టుకొంటూ గట్టిగా అరుస్తున్నాడు. బిందెలతో నీళ్ళు గుమ్మరిస్తూనే వున్నారు. అతని కింకా స్పృహ రాలేదు.

"అయ్యో! బతకడేమోనే ఖర్మం" 14 ఏళ్ళ పిల్ల అంటోంది

"ఛా! అరవబోకే నీ దుంపతెగా" అదమాయించింది 40 ఏళ్ళ ముత్తయిదువ. పెళ్ళికుమారుడికి మూర్ఛలని అందరూ గగ్గోలుపడుతున్నారు. నాలుగేళ్ళ క్రితం దాకా మూర్ఛలు వున్నమాట నిజమేగాని, యీలోగా అవి రాకపోవటంవల్ల తగ్గిపోయాయనుకున్నామనీ, అప్పటికి మళ్ళీ యిదేరావటమనీ, అందుకు ఏవైనా బలమైన కారణాలు వుండాలనీ పెళ్ళికొడుకు పినతండ్రి సర్ది చెప్తున్నాడు.

కుటుంబయ్యకు దిమ్మతిరిగింది. ఆగ్రహంతో వియ్యంకుడిమీద విరుచుకు పడ్డాడు.

"మూర్ఛలవాడిని తగిలించి - నా కూతురు గొంతుక కోస్తావా! ముండాకొడకా, నీకు లేరూ కూతుళ్ళు" అని అరిచాడు. వియ్యంకుడు మెత్తనివాడే గాని యీ నరసింహావతారాన్ని చూచి అతనూ వళ్లు మరిచాడు.

"మాటలు మిగిలితే తన్నులు తినగలవు. మూర్ఛలు రోజూ రావు. ఇదేదో విచిత్రం జరిగింది. అదీకాక తమ్ముడి కూతురి పెళ్లికే నీళ్ళతోడినవాడివి నువ్వా ప్రయోజకుడివేనా" అన్నాడు.

"మూర్ఛలని చెప్పాడుట దుర్మార్గుడు" అన్నదో వితంతువు.

ఈ తంతు అంతా చూస్తున్న పెళ్ళికొడుకు పినతండ్రి అందుకొని—

"ఆగ్రహమెందుకు బావగారూ! వాటికేం లెండి, పెళ్ళవగానే అవీ కమ్మకుపోతాయ్." అన్నాడు వెనకటిమాటలు గుర్తుకు తెస్తూ. కుటుంబయ్య మరి నిలవలేదు. సరాసరి లోపలికి పరుగెత్తాడు యీ దిక్కుమాలిన సంబంధాన్ని తిట్టుకుంటూ. వెంకమ్మ చేతులు తిప్పుకుంటూ అరిచింది. "బాడకావ్ సంబంధం చేసి పిల్లగొంతుకోశావ్" అంది.

"పాకీముండా - యీ దిక్కుమాలిన బుద్ధి నీకే పుట్టింది. లేకుంటే—" ఆగిపోయాడు ఏం జరిగేదో వూహించుకుంటూ. వెంకమ్మ కూలబడిపోయింది. నిరభ్యంతరంగా తల బాదుకుంటూనే అంది. "నా కూతురు గీత యిల్లా రాసివుంటే—యీ సంబంధం సీతకల్లా అవుతుంది." చాలా సేపయినతరువాత వరుడు లేచి తమ విడిది చేరినతరువాత తన ఆంతరంగిక మిత్రుడితో గావల్ను అంటున్నాడు "అదంతా సీత చూసిన చూపు సుమా" అని. ★








పెద్దకథ

# సుగుణ

జి. సి. రామకృష్ణ

## 13

అది ఒక సాయంత్రం. అంధకారం సూర్యుణ్ణి కౌగిలించుకోవాలని తరుముకుంటూ వెళ్తూ ఉంది. సూర్యుడు చిక్కకుండా నిష్క్రమిస్తున్నాడు.

దేవాలయంలోని గంటల ఓంకారనాదం ఆకాశంలో వ్యాపిస్తున్నది. పెన్నానది వరదలతో పొంగి రంగనాయకస్వామి పాదాలు తాకాలని ప్రయత్నిస్తూ, తన కోరిక తీర్చుకోలేక, దేవాలయ ప్రాకారాలను ఒరుసుకుంటూ హోరుమని ధ్వని చేస్తూ ప్రవహిస్తూ ఉంది.

దేవాలయ గోపుర శిఖరాలు, "మళ్ళీ రేపు వస్తావుకదూ?" అని చిరునవ్వులతో సూర్యుణ్ణి అడుగుతున్నట్లు, తళతళ మెరుస్తున్నాయి. ఆ దేవాలయ గోపురం, ఎందరు మానవులు, శిల్పులు, కళాకారులు, చెమటోడ్చి నిర్మించారో కాని, అది మానవుడు ఆకాశానికి చేరాలని చేసిన ప్రయత్నానికి చిహ్నంలాగా ఉంది. ఆ గోపురశిఖరాలు, ఆకాశానికి చాలా దగ్గరలోనే ఉన్నట్లున్నాయి.

ఒకరి కౌగిలిలో ఒకరు మురిసిపోతూ లీనమైపోయే ప్రేమికులలాగా, దేవాలయంలో గంటల గణగణధ్వని పెన్నానది ప్రవాహధ్వనితో కలిసి, ఏదో అనిర్వచనీయమైన ఆవేశాన్నీ, ఉద్రేకాన్ని, కలిగించే సంగీతంలా వినిపిస్తూ ఉంది.

సుగుణ ఆ ధ్వనివింటూ వాకిట్లో, కూచుంది. ఆమె మనసులో ఇంక ఏ ఆలోచనలూ కోరికలూ లేవు. అలా ఎంతసేపు కూచుందో ఆమెకు జ్ఞాపకంలేదు. సుధాకర్ వచ్చి ఏమిటో చెప్పి వెళ్ళిపోయాడు. "సరేలే" అనిమాత్రం జవాబిచ్చింది.

"కడపట్లో కూర్చుని అఘోరించడం ఎందుకు? భోజనాలకు రారాదూ?" అని ఎక్కసంగా పిలిచింది అమ్మ.

"నాకు ఆకలికాలేదు" అని సుగుణ విసుగుతో జవాబిచ్చింది.

"ఏం? ఆకలెందుకాదు? లేచిరా" అని తల్లి ఆజ్ఞాపించింది.

"రామ్మా. వాడు తర్వాత తింటాడులే. ఆ కుంక ఎప్పటికొస్తాడో వీధులన్నీ తిరిగి" అని రంగమ్మకూడా పిలిచింది.

విధిలేక సుగుణ అన్నం ముందు కూచొని నాలుగు మెతుకులు తిని కళ్లు మూసుకొని పడుకొంది.

తర్వాత ఏమి జరిగిందో ఏమో, ఛటా, ఛటా దెబ్బల చప్పుడు వినిపించి సుగుణ గాభరాపడి కళ్ళు తెరిచి చూచింది.

"ఎక్కడికి పోయావు ఇంతసేపూ?" అని నాన్న సుధాకరుణ్ణి చావగొడుతున్నాడు. రంగమ్మ, శేషమ్మ, రాఘవయ్యను బ్రతిమాలుకొని అడ్డంతీశారు.

"అక్కయ్యతో చెప్పి పోయాను నాన్నా" అని సుధాకర్ వెక్కిళ్లు పెడుతూ ఏడుస్తూ అన్నాడు. సుగుణ గుండె ఝల్లుమంది.

శేషమ్మకు ఒళ్లు మండిపోయింది.

"ఓసి, దయ్యమా, గుడ్లు మిటకరించుకొని చూస్తున్నావుగదే. ఏమని చెప్పిపోయాడు వాడు నీతో?" అని తల్లి సుగుణను గద్దించి అడిగింది.

"నాకు జ్ఞాపకం లేదమ్మా" అని సుగుణ గజగజలాడుతూ చెప్పింది.

"ఎక్కడికి పోయావ్?" అని రాఘవయ్య మళ్ళీ ఒక్క అరుపు అరిచాడు.

"కస్తూరిదేవీ హైస్కూల్లో నాటకం అయితే చూస్తామని పోయాను నాన్నా" అన్నాడు సుధాకర్ ఏడుస్తూ.

రంగమ్మా, శేషమ్మా, సుధాకరుణ్ణి ఎలాగో బ్రతిమాలి, నాలుగుముద్దలు అన్నం తినిపించారు.

ఎంతసేపు కళ్లుమూసుకొని పడుకున్నా సుగుణకు నిద్రపట్టలేదు. మెల్లగా లేచి సుధాకరుడి ప్రక్కన కూచొని తలమీద చేయి వేసింది. రెండు కన్నీటిబొట్లు సుధాకరుడి బుగ్గమీద పడ్డాయి. సుధాకర్ నిద్రలో కూడా ఉండి ఉండి ఎక్కిళ్ళు పెడుతున్నాడు.

కొంతసేపటికి కళ్ళు తెరిచి, సుగుణను చూచి అదిరిపడి లేచికూచున్నాడు. సుగుణ కన్నీరు ఆపుకుంటూ,

"ఇందాక ఎక్కడికి పోయినావు నాయనా?" అని అడిగింది.

"నీవు వాకిట్లో కూచొనిఉంటే, చెప్పి పోయానక్కయ్యా. కస్తూరిదేవీ హైస్కూల్లో యానివర్సరీ అనీ, వెళ్తున్నాననీ చెప్పాను. నీవు సరేలే, అన్నావు."

రాఘవయ్య కళ్లు తెరిచి చూచాడు. అక్కా, తమ్ముడు, ఏదో మాట్లాడుకొంటున్నారు. ఆయన పశ్చాత్తాపంతో కొంత బాధపడి ఇంకోకవైపు తిరిగి పడుకున్నాడు.

"ఏం నాటకం వేశారు?" అంది సుగుణ మెల్లగా.

"చాలా వేశారు. డాన్సులు, నాటకాలూ, అన్నీ. కానీ ఒక్కటి మాత్రం బలేబాగుంది. శివుడు తపస్సు చేసుకుంటూ ఉంటాడు. మన్మథుడు రతీదేవితో కూడా వచ్చి శివుడిపైన బాణాలు వేస్తాడు. శివుడు మూడోకన్ను తెరిచి మన్మథుణ్ణి కాల్చి బూడిద చేసేస్తాడు. "అయ్యా, నా భర్తను బ్రతికించండి" అని రతీదేవి బూడిదలో పడి పొర్లాడుతూ, గుండెలు బాదుకుంటూ ఏడుస్తుంది. అమాయిన దేవతలందరూ ఆమె మొర ఆలకించి, శివుడిదగ్గరికి వచ్చి, "స్వామీ, మన్మథుడు లేకుంటే లోకంలో ఆనందమే ఉండదు. ఆనందం లేకపోతే మనుషులు బ్రతకలేరు. అప్పుడు సృష్టిఅనేది లేకుండా లోకాలన్నీ నాశనం అయిపోతాయి" అని ఈశ్వరుణ్ణి ప్రార్థిస్తారు. ఈశ్వరుడు "నిజమే. నేను చాలా పొరపాటు పడ్డాను. మన్మథుడు శరీరం అనేది లేకుండా, అందరిలోనూ వ్యాపించి ఉంటాడు." అని కరుణిస్తాడు. రతీదేవి ఆనందంతో తన భర్తను బ్రతికించుకుని వెళ్లిపోయింది" అని సుధాకరుడు కథ ముగించాడు.

సుగుణ వణికిపోతూఉంది. కళ్ళనిండా నీళ్లొచ్చాయి. గుటకలువేస్తూ పెదవులు పళ్లతో గట్టిగా కొరుక్కుంటూ ఉంది.

"ఏమిటక్కయ్యా!" అని సుధాకర్ ఆందోళనతో అడిగాడు.

"ఇంక పడుకో నాయనా. పొద్దుపోయింది" అని సుగుణ వెళ్ళి పడుకొంది.

కొంతసేపయినతర్వాత, "సుగుణా!" అని ఎవరో పిలిచారు.

సుగుణ కళ్లు తెరిచి చుట్టూ చూచింది.

సుధాకరుడు యోగిలాగా ధ్యానముద్రలో ఉన్నట్టున్నాడు.

నాన్న, క్రుంగి కృశించిపోయి, లోకాన్ని మరిచి నిద్రపోతున్నాడు.

తల్లి ఎండిపోయినచెట్టులాగా పడి గాఢనిద్రలో ఉంది.

తనకు ఈలోకంతో ఏమీ సంబంధం లేనట్లు రంగమ్మ దూరంగా కటిక నేలమీద పడుకొని ఉంది. సుగుణ కళ్లుమూసుకొని మళ్ళీ పడుకొంది. కానీ "సుగుణా!" అని ఎవరో పిలిచారు.

లేచి కూచొని సుగుణ చెవులు గట్టిగా మూసుకుంది. 'గీ' అనేశబ్దం, ఆ శబ్దంలో మళ్ళీ 'సుగుణా' అనే పిలుపు వినిపిస్తున్నాయి. పెన్నానదీ ప్రవాహధ్వని స్పష్టంగా హోరుమని వినిపిస్తూ ఉంది.

సుగుణ అడుగులో అడుగు వేసుకుంటూ రోడ్డుమీదికి వచ్చింది. 'ప్రపంచానికంతా మేమే ప్రతినిధులం' అన్నట్లు కుక్కలు ఒకసారి మొరిగి ఊరుకున్నాయి.

దేవాలయంవైపు నడిచింది సుగుణ. మంటపంనిండా బిచ్చగాళ్ళు పడుకొని ఉన్నారు.

దేవాలయం ఎదుట కొంతసేపు నిల్చొని సుగుణ ఒకసారి తన కుంటికాలు చూచుకొని "భగవంతుడా! నేను నీ కేంద్రోహం చేశాను?" అని అడిగింది. కాని ఈప్రశ్నకు జవాబురాలేదు.

పెన్నానది హోరుమని సంగీతం ఆలపిస్తూ సుగుణను ఆహ్వానించింది.

సుగుణ అప్రయత్నంగా పెన్నానదివైపు మరలింది. గోడకు ఆనుకొని, నిల్చొని, ఒకసారి ప్రవాహాన్ని చూచింది.

నది మధ్యలో ఏదో గలగల చప్పుడవుతూ ఉంది. సుగుణ ఆవైపే చూచింది.

ఎవరో మనిషి ఏటికి ఎదురీదుతున్నాడు. "అమ్మో ఎంత ధైర్యం!"

చేతులతో నీళ్లని బాదుతూ పోరాడుతున్నాడు. పాపం! ఎవరో ఆ మనిషి?

పిచ్చి సుగుణ ఆమనిషి ఎవరో తెలుసుకోవాలని గిజగిజలాడిపోయింది.

"సుగుణా" అని ఆ ఏటికి ఎదురీదేమనిషి పిలిచాడు. ఆ గొంతు సుగుణకు బాగా పరిచయం. అది మామయ్య గొంతే. చంద్రం మామయ్య గొంతే అది.

"మామయ్యా" అని కేకేసి, సుగుణ చేతులు పైకెత్తింది. గోడమీద ఆనుకున్న కుంటికాలు జారింది. నీళ్ళతో కొంతసేపు పోరాడింది సుగుణ. ఆ నిర్దోషిని తనలో దాచుకోవడం ఇష్టంలేక, పెన్నానదీ జలం ఆమెను రెండు మూడుసార్లు పైకి తోసేసింది.

కానీ, అప్పటికే సుగుణ ప్రాణవాయువులు, నది హోరులో కలిసిపోయాయి.

పెన్నానది దుఃఖాన్ని ఆపుకోలేక హోరుమని ఏడుస్తూ ప్రవహించింది.

## 14

సుగుణ శరీరాన్ని పెన్నానది కన్నీటితో మోసుకొనిపోయి, సముద్రునికి అప్పగించింది. కాని ఆ సంగతి లోకానికెలా తెలుస్తుంది? సుగుణ ఎవరితోనో లేచిపోయిందన్న వార్త ఇంటింటికీ ప్రాకిపోయింది.

"ఒకమ్మాయి, ఒక మగవానితో లేచి

#  సుగుణ 

పోయింది" అని తెలిసిందంటే చాలు. కొంతమందికి ఆ వార్తను వ్యాపింపజేయటంలో ఎక్కడలేని ఆసక్తి!

"సుగుణ నిర్దోషి" అని సాక్ష్యం చెప్పడానికి ఎవ్వరూ లేకపోయారు.

రంగనాయకస్వామికి నోరు లేదు. పెన్నానదికి ఏడవడం తప్ప యింకేమీ చేతకాదు.

సుధాకరుడు, రాఘవయ్య, వెతికి వెతికి విసిగిపోయి వచ్చారు.

"లేదమ్మా, ఎక్కడా కనిపించలేదు" అని సుధాకరుడు వెక్కి వెక్కి ఏడుస్తూ తల్లికి చెప్పాడు.

"ఎంతపని చేశావమ్మా" అని, రాఘవయ్య అవమానంతో, దుఃఖంతో కృంగిపోతూ కళ్లనీళ్లు తుడుచుకొన్నాడు.

"నాకు నమ్మకంలేదురా. అది ఎక్కడో, బావిలోనో గుంటలోనో దూకే ఉంటుంది. అది చాలా రోజులనుంచి ఆలోచిస్తూనే ఉంది. నాకు దానిముఖం చూస్తేనే అనిపించింది–" అంది రంగమ్మ.

"అసలు దానికి పరిచయం అయిన మొగవాళ్లు ఎవరున్నారు వదినా? అది మొగాళ్ళతో మాట్లాడాలంటేనే గడగడలాడిపోయేది" అని శేషమ్మ దుఃఖం ఆపుకోలేక భూదేవిని ఆశ్రయించి వలవల ఏడ్చింది.

కాలం గడిచిపోతూనే ఉంది.

ఇంట్లో ఏ స్థలం చూచినా, అందరికీ సుగుణే జ్ఞాపకానికి వచ్చేది.

"అమ్మా నిన్న నేను పార్కు దగ్గరికి పోతే, అక్కయ్యలాగే, ఒకమ్మాయి కుంటుకుంటూ పోతూఉంది. తలాలున చూచి సుగుణక్కయ్యేమో ననుకున్నాను. దగ్గరికిపోయి చూచాను. ఆ మెవరో, ఒక ముసలాయనతో గూడా నడిచిపోతూ ఉంది." అన్నాడు సుధాకర్.

"ఎందుకు నాయనా, నా కడుపులో చిచ్చు రేపుతావు?" అని శేషమ్మ దుఃఖంలో మునిగిపోయింది.

భారంగా, దీనమొకయుగంగా, రెండేళ్లు గడిచిపోయాయి; శేషమ్మ ఒక ఆడపిల్లను ప్రసవించింది.

"అయ్యో మళ్ళీ ఆడపిల్ల పుట్టిందే" అని దంపతు లిద్దరూ కుమిలిపోయ్యారు. శేషమ్మ తన బిడ్డకాళ్లను తడివి చూచుకొని, "మా బంగారుతల్లి కుంటిపిల్లకాదు." అని సంతోషించింది.

"మన దుఃఖం చూడలేక, దేవుడు, కుంటికాలు బాగుచేసి, మన సుగుణను, మనకే ఇచ్చాడు" అని ఆనందబాష్పాలతో సంతృప్తిపడ్డాడు రాఘవయ్య.

"మళ్ళీ అక్కయ్య నాకు చెల్లెలుగా పుట్టిందా?" అని ఆలోచిస్తూ ఆనందించాడు సుధాకర్.

"ఏమిటే, ఇంత పొద్దెక్కినా బిడ్డకు నీళ్లు పొయ్యకుండా కూచున్నావు?" అని రంగమ్మ, బిడ్డను చేతికి తీసుకొని ఎగరేసి ముద్దులు పెట్టుకుంటూ, "మళ్ళీ మాకు సుగుణమ్మతల్లి పుట్టిందా? దేవుడితో తగవులాడి, కుంటికాలు బాగుచేయించుకొని, మళ్ళీ మా సుగుణమ్మ మాదగ్గరకే వచ్చిందమ్మా" అంటూ రంగమ్మ సుగుణకు నీళ్లుపోయడానికి తీసుకొని పోయింది.

దుర్భరదారిద్ర్యంలో దుఃఖంలో అటకటించిన ఆ చిన్నగృహంలో ఆనందం ఒక క్షణంసేపు విలాస నృత్యం చేసింది.

(అయిపోయింది)

# ★ కళోద్ధారకులు ★

శేషు: ఇక అంతే గురూ!

సుధా: (విచారంగా) కళకోసం తన జీవితాన్ని అంకితంచేశానని ఆమె చెప్పిన కబుర్లన్నీ కానసమేనా?

కళా: (కోపంతో) శుద్ధమోసం! తన స్వార్థంకోసం మన శుభోదయా నాట్యమండల్ని ఉపయోగించుకొంది. తద్వారా ఒక ధనవంతుణ్ణి సంపాదించి కళకు తిలోదకాలు యిచ్చింది.

సుధా: (కోపంతో) ఒరేయ్ కళాధర్! ఇలాంటి చీడపురుగుల్ని ఏరిపారెయ్యకపోతే - అసలే పతనదశలో వున్న నాటకకళ మరీ పతనమై పోతుందిగా. మన శుభోదయా నాట్యమండలి అంటే కళాకేంద్రం అనుకుంటారా? లేక నైట్ క్లబ్ అనుకుంటారా? ఇప్పుడే కాంచనలత యింటికి వెళ్ళి అటో యిటో తేల్చుకు వచ్చేస్తాను.

[లేచి ఉద్రేకంతో వెళ్ళబోతాడు]

కళా: (సుధాకర్ను పట్టుకొని) ఒరేయ్! సుధాకర్! ఆవేశాన్ని కొంచెం తగ్గించుకొని నేను చెప్పేది విను. జరిగిందేదో జరిగిపోయింది. ఇక కాంచనలత మీద ఆశవిడిచిపెట్టి మన నాటకం దిగ్విజయంగా నడవడానికి ఉపాయం ఏదైనా ఆలోచించు.

సుధా: (నిస్పృహతో) ఇక ఉపాయానికేముందిరా కళాధర్! మరో కిరాయి నటిని ఎవరినైనా చూసుకోవాలిసిందే! (శేషుతో) ఒరేయ్ శేషూ! నీకు రెండు రోజులు టైమిచ్చాను. ఈ రెండురోజులలో మన "సంధ్యారాగం" నాటకంలో "సంధ్య" పాత్ర ధరించడానికి సరిపోయే ఒక కిరాయి నటిని కుదుర్చుకురావాలి.

శేషు: (సంతోషంతో) రెండురోజులు కూడా అక్కర్లేదు గురూ! ఈ రాత్రికే తీసుకురాగలను.

కళా: (నిస్పృహతో) మళ్లా కిరాయి నటిని కుదుర్చుకోవలిసిందేనట్రా సుధాకర్!

సుధా: (నిస్పృహతో) అంతకంటే గత్యంతరం లేదురా కళాధర్!

శేషు: మీరు నిరాశపడకండి గురూ! నేను సాయంత్రానికి మీకు ఏదో ఒక వార్త తీసుకువస్తాను. (ఎడమవైపు వెళ్ళిపోతాడు.)

సుధా: (శేషు పోతున్నవైపు చూపిస్తూ) ఇలాంటి ఉత్సాహవంతులైన యువకులవల్లే కళ ఏనాటికైనా బాగుపడాలిరా.

కళా: (విసుగ్గా) బాగుపడుతుందిరా బాబూ బాగుపడుతుంది. ఇక మన నాటకానికి చూస్తే ఒకనెల రోజులే గడువు వుంది. ఇప్పుడు అమాంతంగా "సంధ్యా" పాత్రధారిణి దగాచేసింది. తీరా ప్రకటన చేసేశాం - యిప్పుడీ నాటకాన్ని నిర్విఘ్నంగా కొనసాగించేదెట్లా?

సుధా: నువ్వనవసరంగా బుర్ర పాడు చేసుకున్నందువల్ల ప్రయోజనం లేదురా!- చెయ్యవలసిన ప్రయత్నాలు ఎలాగూ చేస్తున్నాం.

[ఇద్దరూ మౌనంగా ఆలోచిస్తూ వుంటారు - క్షణం నిశ్శబ్దం. ఎడమవైపు నుంచి సుబ్బులు ప్రవేశిస్తుంది. వయస్సు 16 సంవత్సరాలు. - జుట్టు సంస్కారం లేకుండా చిందర వందరగా ముఖంమీద పడుతూవుంటుంది. పొట్టి పరికిణీ - ఓణీ - వల్లజాకెట్ వేసుకొని వుంటుంది. ముఖం గుండ్రంగా ఉత్సాహంతో తొణికిసలాడుతూవుంటుంది. చూడగానే 'పనిపిల్ల' అని తెలుస్తుంది. ఆమె చేతిలో చెంబు వుంటుంది.)

సుబ్బులు: (వినగా) బాబుగారూ! పాలు ఎక్కడుంచమంటారూ?

సుధా: (విసుగ్గా) ఒక క్షణం ఆగు! మా ఆలోచనలకు అంతరాయం కలిగించకు.

(సుబ్బులు బెదురుచూపులతో యిద్దర్నీ చూస్తూవుంటుంది. సుధాకర్ గడ్డం కింద చెయ్యి పెట్టుకొని తీవ్రంగా ఆలోచిస్తూ వుంటాడు. కళాధర్ సుబ్బులుకేసి పరిశీలనగా - తీక్షణంగా చూస్తూవుంటాడు.)

సుబ్బులు: (కళాధర్తో) అదేటి బాబుగారూ! ఎప్పుడూ లేంది నాకేసి అలా సూత్తున్నారు!— మా యింటిపక్కనున్న గంగయ్యగోడు కూడా యిలాగే సూత్తుంటే ఒకనాడు మా బాబుతో సెప్పాను. ఎహే హే! (నవ్వుతుంది)

సుధా: (చిరాగ్గా) దీపంసెమ్మెలా అలా నిలబడే బదులు ఆ చెంబు తీసుకువెళ్ళి ఆ గదిలో పెట్టకూడదటే!

(సుబ్బులు నవ్వుతూ కుడివైపు వెళ్ళి చెంబు లోపల వుంచి తిరిగివస్తుంది. కళాధర్ యింకా ఆమెకేసే చూస్తూ ఆమె ప్రతి కదలికనూ గమనిస్తూ వుంటాడు.)

కళా: (ఆమె ముఖంలోకి తీక్షణంగా చూస్తూ) సుబ్బులూ! యిలా రా! (ఆమె జడుస్తూ దగ్గరకు వస్తుంది. కళాధర్ లేచి నిలబడి) అటు తిరుగు! (సుబ్బులు ప్రేక్షకులవైపు తిరుగుతుంది. అతను ఆమె ప్రక్కను నిలబడతాడు) ముఖం ఓరగా పెట్టి కిందకు దించు. (ఆమె ముఖం కిందకు దించుతుంది) రెండు చేతుల్నీ నడుంమీద వుంచి యిలా నాట్యభంగిమలో నిలబడు. (అతను నిలబడి చూపిస్తాడు. ఆమె కూడా అలా నిలబడుతుంది)

సుధా: (ఇంతవరకూ ఆశ్చర్యంగా చూస్తూ యిక భరించలేక లేచి) నీకేమైనా మతిపోయిందటరా కళాధర్?

కళా: (సుధాకర్ వైపు ముఖం తిప్పకుండా నే చేతితో సంజ్ఞచేస్తూ) ఉష్! (సుబ్బులుతో) ఇక సరిగా నిలబడు. (నిలబడుతుంది) నీకేమైనా చదువొచ్చునా?

సుబ్బు: ఊఁ! ఊఁ! సిన్నప్పుడు ఒకటో కళాసు పట్టేనండి ఆ పేర్లు యింకా గ్నాపకం వున్నాయి! అల-వల-పిలక—

సుధా: (మధ్యలో అందుకొని) పిలక కాదు పలక!

కళా: (సంతోషంతో) సెహభాష్! నువ్వు యిక మా నాటకంలో సంధ్యపాత్రకు సరిగా సరిపోతావ్!

సుధా: నీకు యివేళ కొంచెం బుర్ర చెడిపోయినట్లు కనిపిస్తోందిరా కళాధర్!

కళా: ఏం?

సుధా: లేకపోతే అపస్వరాలు పలికే యీ పిల్లను తీసుకువెళ్లి స్టేజి ఎక్కిస్తే మన మర్యాదయేమైనా దక్కుతుందటరా?

కళా: ఒరేయ్ సుధాకర్! నెలరోజులలో యీ సుబ్బుల్ని గొప్పహీరోయిన్‌ని చెయ్యలేకపోతే నాపేరు కళాధరే కాదు. ఎంత శ్రమకయినా ఓర్చి యీమెను ఉత్తమ నటిగా తయారుచేస్తే కిరాయి నటీమణుల కోసం వెతుక్కోవలసిన బాధ తప్పుతుంది.

సుబ్బు: (ఆశ్చర్యంలో) ఏటిబాబుగారూ! నాటకంలో నన్ను ఏస మేయిస్తారా?

కళా: అవును! నీకు యిష్టమేనా?

సుబ్బు: (ఆనందంతో) ఓ! సినిమాలో జీవకన్నెకలాగ మంచిబట్ట లేసుకోవచ్చు. (భయంతో కళ్లు పెద్దవిచేసి) మా బాబుకు తెలిస్తే వూరుకోడండి!

కళా: మీబాబుతో నేను మాట్లాడతానులే! (సుధాకర్‌తో) ఒరేయ్ సుధాకర్! నేను అమోఘమైన కార్యభారాన్ని నెత్తిమీద వేసుకున్నాను. నువ్వీ విషయంలో నాతో సమానంగా శ్రమపడాలి.

సుధా: నువ్వొకటి నేనొకటి నటరా కళాధర్!

కళా: నువ్వు వేగం వూళ్లోకి వెళ్లి పలక, ఒక పుస్తకం, కొన్ని రకాలబట్టలు సుబ్బులుకు సరిపోయేవి తీసుకురావాలి.

సుధా: సరే! అలాగే తీసుకువద్దాం!

కళా: ఇక పేపర్లలో సంధ్యపాత్రకు తిన్నగావున్న కాంచనలత పేరు కొట్టించి "కుమారి సుభాషిణి" అని రాయించు.

సుధా: (సంతోషంతో) ఈపేరు అమోఘంగా వుంది. (సుబ్బులుతో) యివేళ నుంచి నీపేరు సుబ్బులుకాదు సుభాషిణి. జ్ఞాపకం వుంచుకో.

సుబ్బు: సుబాసి నేటి బాబుగారూ?

కళా: (ఆమెకేసి తీక్షణంగా చూస్తూ) 'సు-భా-షి-ణి' అను.

సుబ్బు: (భయంతో) సుభాషిణి.

కళా: వెళ్లి ఆ కుర్చీమీద కూర్చో.

సుబ్బు: (భయంతో) అమ్మ బాబోయ్! నే నా కుర్చీమీద కూకుంటే మా బాబు సంపేత్తాడు.

కళా: (కోపంతో) నిశ్శబ్దంగా ముందు ఆ కుర్చీమీద కూర్చుంటావా? లేదా?

[సుబ్బులు భయంతో కుర్చీ మీద కూర్చుంటుంది]

కళా: (పుస్తకం తెరిచి) నేను చదివిన మాట నువ్వు తిరిగి అంటూవుండు. (చదువుతూ) యీ వెన్నెల రాత్రిలో—

సుబ్బు: (జాగ్రత్తగా తిరిగి అంటుంది) యీ వెన్నెలరాత్రిలో—

కళా: (పుస్తకం చూస్తూ) యిలా మనం రోజూ కలుసుకుంటూ వుంటే...

సుబ్బు: యిలా మనం......(మరిచి పోతుంది.)

సుధా: యిలా మనం రోజూ

సుబ్బు: యిలా మనం రోజూ

[ఎడమవైపునుంచి శేషు తొందరగా వస్తాడు.]

శేషు: (ఉత్సాహంతో) విదునిముషాలలో మనకు హీరోయిన్ దొరికింది. కాని నాటకానికి రెండువందల రూపాయలు కావాలంటోంది.

కళా: ఒరేయ్ శేషూ! యిక ఆ కిరాయి నటుల మాట నాదగ్గర ఎత్తకు. (సుధాకర్‌తో) ఒరేయ్ సుధాకర్! మీ రిద్దరూ వూళ్లోకి వెళ్ళి నేను చెప్పినవన్నీ తీసుకొని వేగం రండి.

శేషు: (సుబ్బులుకేసి ఆశ్చర్యంగా చూస్తూ) ఏమిటే సుబ్బీ! కుర్చీ ఎక్కి దర్జాగా కూచున్నావ్?

సుబ్బు: (కోపంతో) ఏమండోయ్ అబ్బాయిగోరూ! నన్ను సుబ్బీ గిబ్బీ అంటే వూరుకోను.

కళా: అబ్బాయిగోరు కాదు - అబ్బాయిగారు అను.

సుబ్బు: అబ్బాయిగారు.

[సుధాకర్ శేషును తీసుకొని ఎడమవైపు వెళ్లిపోతాడు. కళాధర్ ఆమెకు మాటలు చెబుతూవుంటాడు. —తెర.)

* * *

## రెండో దృశ్యం

(నెలరోజులు గడిచిన తరవాత—అదే గది—రాత్రి 8 గంటలు. తెర ఎత్తగానే గది ఖాళీగా కనిపిస్తుంది. ఈ సారి గది శుభ్రంగా సర్దినట్లు వుంటుంది. గదికి ఎడమవైపున టేబిలూ, నాలుగు కుర్చీలు వుంటాయి. మిగిలిన గదంతా ఖాళీగా వుంటుంది. టేబిలుమీద పుస్తకాలు సర్ది వుంటాయి. ఎడమవైపునుంచి కళాధర్ సుధాకర్ ఉత్సాహంతో మాట్లాడుకుంటూ ప్రవేశిస్తారు.)

సుధా: ప్రేక్షకులంతా 'కుమారి సుభాషిణి' ఎవరా అని ఆశ్చర్యపోయారు. ఆమె అందాన్ని, తీవినీ చూసి హాల్లో వున్న యువకులంతా ఎవరి కుర్చీలలో వాళ్ళు మూర్ఛపోయారనుకో!

# ★ కళోద్ధారకులు ★

కళా: (సగర్వంగా) ఆంధ్ర రంగస్థలానికి అద్భుతమైన కథానాయకిని సృష్టించి యిచ్చిన నాకు ఆంధ్రదేశం ఏం ప్రతిఫలం యిస్తుందిరా?

(సరిగా ఈమాట అనేసమయంలో కుడిప్రైపునుంచి సుభాషిణి తొందరగా వస్తుంది. మొదటి దృశ్యంలో కనిపించిన సుబ్బులుకు యీ సుభాషిణికి ఎంతో తేడా కనిపిస్తుంది. రెండు జడలు - ముఖం అందంగా వుంటుంది. పెదవులకు లిప్‌స్టిక్ ఎరుపు—నాన్లెట్ చీర—జోడు—స్వచ్ఛమైన వస్త్రధారణ.)

సుభా: ఎంతసేపయ్యింది మీరు వచ్చి—మీకోసం గంటనుంచి వెతుకుతున్నాను. (విసుగ్గా) అబ్బబ్బా! యిక యిక్కడ నేను వుండలేనేమో అనిపిస్తోంది.

కళా: ఏం? యిప్పుడేం కొంపమునిగింది?

సుభా: ఆ శేషు చూడండి! యింకా నన్ను 'సుబ్బులూ' 'సుబ్బులూ' అని పిలుస్తున్నాడు!

సుధా: (నవ్వుతూ) ఓహో! అదా కథ! యిక అలా అనవద్దని చెబుతాంలే!

సుభా: అంతే కాదు నన్నొక క్షణమైనా చదువుకోనివ్వడు. పుస్తకం తెరిచేసరికి దగ్గరకువచ్చి ఏదో 'ప్రేమ' 'ప్రణయం' అంటాడు. (విసుగ్గా) అతనితో నాకు చాలా గొడవగా వుందండి!

కళా: (కోపంతో) వాడి పిడిముఖం తగలెయ్యా! మనం యిప్పటికి ఒకదారికి వచ్చామని అనుకుంటూ వుంటే వీడికి ప్రేమ పిచ్చి పట్టిందా?

సుధా: ఒరేయ్ కళాధర్! ఈ చిక్కంతా ఎందుకు వచ్చిందంటే - మనం సుభాషిణికి శృంగారం చదవడం - పఠించడం నేర్పాం కాని - ప్రణయంగురించి కనీసం ఒక మాటైనా చెప్పలేదురా!

కళా: జీవితాన్నంతా కళకే అంకితం చేసి - పెళ్లాం పిల్లలు లేకుండా - బైరాగ్యాశ్రమంలో వున్న మనం (నిష్ఠురంతో) ప్రణయంగురించి ఏం చెప్పగలంరా సుధాకర్?

సుధా: నీమాట నిజంరా కళాధర్! (సుభాషిణితో) ఇదిగో! అమ్మాయ్! సుభాషిణీ! మేం ఖచ్చితమైన బ్రహ్మచారులం. నాటకాలలో చదివిన కొద్దిమాటలు మినహా మాకు ప్రణయంగురించి ఏమీ తెలియదు. కనక యిక యీ విషయం మీలో మీరే పరిష్కరించుకోవడం మంచిది.

కళా: (కోపంతో) ఎడిసినట్టే వుంది నీ తీర్పు. (సుభాషిణితో) అమ్మాయ్! ఇది పవిత్రమైన కళానిలయం. ప్రేమతో యీ పవిత్రమైన స్థలాన్ని కలుషితం చెయ్యడం మేం అంగీకరించం. కనక నువ్వు వెళ్ళి ఆ శేషుగాణ్ణి యిలా పంపు. వాని మెతేస్తాను.

[సుభాషిణి నవ్వుతూ కుడిప్రైపు వెళ్ళిపోతుంది]

సుధా: (సుభాషిణివెళ్ళినవైపు చూస్తూ) ఇదివరకు చూడ్డానికి అసహ్యంగా వుండే యీ పిల్ల యింత అందంగా ఆకర్షణీయంగా ఎలా మారిందా? అని నాకే ఆశ్చర్యంగా వుందిరా.

కళా: చదువు, సంస్కారం, అందం, ఆకర్షణా యివన్నీ దుబ్బున్నవాళ్ళ సొత్తనుకోసేవురా! ఈ దేశంలో దరిద్రంవల్ల ఎంతో ఉపజ్ఞకలవాళ్లు కూడా రాణించలేకపోతున్నారంటే నమ్మను! ఉదాహరణకు సుబ్బుల్ని చూడు! దానిలో నటికి కావలసిన సహజలక్షణాలు ఎన్నో వున్నా దారిద్ర్యంవల్ల రాణించలేకపోయింది. ఆమె సౌందర్యంకూడా దరిద్రంలో అణిగిపోయివుంది. ఆమెను మనం కొంత చేయూతయివ్వగానే ఎంత గొప్పగా తయారయ్యిందో చూడు. ఈ దేశంలో దరిద్రంవల్ల యింకా ఎంతమంది సుభాషిణులు అణిగిపోతున్నారో ఆలోచించు!

సుధా: (నిరాశతో) ఇక యిప్పటిలో యీ దేశానికి మంచిరోజులు వస్తాయను కోనురా కళాధర్!

కళా: ఏం మంచి రోజులురా పిచ్చివాడా! ఈ దేశంలో రచయితకు అరకప్పు కాఫీకి దిక్కులేదు చిత్రకారుడికి రంగులు కొనుక్కొ డానికి శక్తి లేదు. నటుడికి నాటకం ఆడడానికి డబ్బులేదు. —ఎవరిపైనా సున్నితి నాటకం ఆడదామన్నా, చివరకు నాటకం ఆడ్డానికి సరిపడ చేసే థియేటరయినా లేదు.—ఏ ఇంగ్లండు దేశంలోనైనా పుట్టక యీ దేశంలో ఎందుకు పుట్టానురా అని నేను విచారించని రోజు లేదురా సుధాకర్.

సుధా: అందుకేరా యీ దేశాన్ని ఖర్మభూమి అన్నారు.

కళా: (సీరియస్‌గా) ఓ రేయ్! ఇక మనం కబుర్లు కట్టిపెట్టి కార్యరంగంలోకి అనూహంతంగా దూకెయ్యాలి. అప్పుడే చాలా టైం అయిపోయింది.

సుధా: సాంబారు మెతుకులు పడిన తర్వాత మరీ ఎక్కువైపోయిందిరా! కొంచెం టీ పడితే గాని బండి ముందుకు నడిచేట్లు లేదు.

కళా: అయితే పద! రెండు కప్పులు టీ తాగివద్దాం. ఇప్పుడే చెబుతున్నాను ఈ

రాత్రి ఒక నిముషం కూడా వృథాగా పోకూడదు.

(ఇద్దరూ ఎడమవైపు వెళ్ళిపోతారు. కుడివైపునుంచి సుభాషిణి వెనక శేషు మాట్లాడుకుంటూ ప్రవేశిస్తారు.)

శేషు: (సంభాషణ కొనసాగిస్తూ) అందుకే ప్రతి చిన్న విషయానికి నేను మా గురుదేవుల్ని ఆదర్శంగా తీసుకుంటూ వుంటాను. ఇద్దరూ జీవితాన్నంతా కళకే అంకితం చేసేశారు. ఉదయం లేచింది మొదలు రాత్రి పడుకునేవరకూ యిద్దరూ కళగురించే తర్కిస్తూవుంటారు. చివరకు నిద్రలో కూడా నాటకాల్ని గురించి కలవరిస్తూవుంటారు.

సుభా: నువ్వుకూడా మీ గురువుగార్లలా కళగురించే ఆలోచిస్తూ కూర్చోకూడదూ? ప్రేమంటూ ఎందుకు?

శేషు: అక్కడే వుంది లేదా అంతా! మా గురువు లిద్దరూ పాత బ్రహ్మచారులు. వాళ్లు బ్రహ్మచర్యానికి పూర్తిగా అలవాటు పడిపోయారు. కొత్త బ్రహ్మచారిని నన్ను కూడా అలా వుండమంటే నా తరమా? నా జీవితాశయం నీ కివేళ చెప్పేస్తాను సుబ్బులూ!

సుభా: (కోపంతో) ఏయ్! సుబ్బులని పిలవొద్దని చెప్పింది నీకు కాదూ! సుభాషిణి అని పిలు! లేదా 'సుభా' అని పిలు! తెలిసిందా?

శేషు: పొరబాటు! ఎక్కువ అలవాటువల్ల అటువంటి పొరబాటు దొర్లుతూ వుంటుంది - చూడు సుభా! నా జీవితాశయం ఏమిటంటే నేను ఒక నటీమణిని వివాహం చేసుకొని జీవితాంతం నాటకకళకోసం పాటుపడాలని. - ఇంతకాలం నాలో అణిగివున్న యీ ఆశయం నిన్ను చూడగానే - ఫ్రాయిడ్ సిద్ధాంతాన్ననుసరించి - అమాంతంగా విజృంభించింది. - అప్పుడే చాలా టైమయిపోయింది. వేగం భోజనంచేసివచ్చి రిహార్సల్సుకు హాజరు కావాలి. వస్తాను!

(ఎడమవైపు వెళ్లిపోతాడు. సుభాషిణి పుస్తకం చదువుతూ వుంటుంది. రెండు నిముషాలు నిశ్శబ్దం - ఎడమవైపునుంచి కళాధర్, సుధాకర్ కేకలు వేసుకుంటూ ప్రవేశిస్తారు. ఇద్దరి ముఖాలు చాలా సీరియస్‌గా వుంటాయి. సుభాషిణి యిద్దరికేసి ఆశ్చర్యంతో చూస్తూవుంటుంది.)

కళా: (కోపంతో గట్టిగా) నువ్వు దుర్మార్గుడవు! దగాకోరువు! నీవల్ల సమాజానికి కలిగే హాని వర్ణించడానికి వీల్లేనిది!

(కుడి చివరకు వెళ్ళి నిలబడతాడు.)

సుధా: (ఎడమ చివర నిలబడి) నేనేం చేశాను?

కళా: (కోపంతో కళ్లు ఎఱ్ఱచేసి) ఇంతకాలంనుంచీ నువ్వెంతో మంచివాడవనుకుంటున్నాను. నువ్వు ప్రపంచాన్ని మోసం చేస్తున్నావు. ధనవంతురాలుకదా అని ఆశించి విమలను నీవలలో వేసుకున్నావు. నువ్వు పుట్టుకతో దరిద్రుడివైనా ధనవంతుడిలా నటిస్తున్నావ్. సన్మార్గాన్ని విడిచిపెట్టి దుర్మార్గాన్ని వరించేవ్!

సుధా: (గంభీరంగా) నేను దుర్మార్గుణ్ణిగా మారానంటే అది నాతప్పు కాదు. నన్ను అలా మార్చిన సమాజానిది ఆతప్పు! (ఉద్రేకంతో) నేను తిండిలేక కడుపు చేత్తో పట్టుకొని దేశమంతా తిరిగాను. నన్ను చూసి జాలిపడినవాళ్లైనా నాకు కనిపించలేదు. చివరకు నౌకరుఉద్యోగమైనా యివ్వమని ప్రాధేయపడి అడిగాను. కాని నాకీ దేశం నౌకరు ఉద్యోగాన్నైనా యివ్వలేకపోయింది. (కోపంతో) చివరకు నాలోవున్న కొద్ది తెలివినీ వినియోగించి దేశానికి ఎదురుతిరిగాను.

కళా: కష్టాలకు లొంగిపోతే యిక నీ విలువ యేముంది? జీవితపు పోరాటంలో ఎటువంటి ఘర్షణలనైనా ఎదుర్కొని సక్రమమార్గాన్ని నడవగలగాలి. అదే సన్మార్గుల లక్షణం!

సుభా: (ఇంతవరకూ ఆశ్చర్యంతో యిద్దరివైపూ చూస్తూ యిక భరించలేక హాలుకు మధ్య—అంటే కళాధర్ సుధాకర్ లకు మధ్య — నిలబడి) ఇంతవరకూ నవ్వుతూ మాట్లాడుకున్నారు. ఇంతలోనే మీకు పేచీ ఎలావచ్చింది?

సుధా: (సుభాషిణి మాట వినిపించుకోకుండా) ఏమైనా నా పతనానికి కారణమైన యీ సమాజంపై ప్రతీకారం తీసుకొని తీరతాను.

సుభా: (సుధాకర్ దగ్గరకు వెళ్లి) ఊరుకోండి!

కళా: (కోపంగా సుధాకర్‌తో) నువ్వు బాల్యస్నేహితుడవు కదా అని యింతసేపూ మంచిగా చెప్పవలసివచ్చింది. (ముందుకు రెండడుగులు వేస్తాడు.)

సుభా: (కళాధర్ దగ్గరకువెళ్లి) మీరైనా ఊరుకోండి.

సుధా: (కోపంతో రెండడుగులు ముందుకువచ్చి) నువ్వు నీ మర్యాదను కాపాడుకోవలసిన అవసరం ఎంతైనావుంది.

సుభా: (భయంతో) హమ్మయ్యో! మీరిద్దరూ కొట్టుకునేలా వున్నారు. నాకు భయంగా వుంది. కేకలువేసి అందర్నీ పిలుస్తాను.

కళా: (మామూలుగా) భయపడకు సుభాషిణీ! మేం రేపటి కొత్తనాటకానికి రిహార్సల్సు వేసుకుంటున్నాం.

సుభా: (గుండెలమీద చెయ్యివేసుకొని) అబ్బ! నాగుండె లింకా కొట్టుకుంటున్నై. ఎంత భయపెట్టారు!

సుధా: (ఎప్పటిలా) ఒరేయ్ కళాధర్! మన నటనలో సహజత్వంవుంది. లేకపోతే సుభాషిణి యింత భయపడి వుండేదికాదు.

[ముగ్గురూ తాపీగా కుర్చీలలో కూర్చుంటారు.]

కళా: మనకు సినిమా నటులకు వున్న తేడా అదేరా! మన నటనలో వున్న సహజత్వం వాళ్లకు చస్తే రాదు. ప్రేక్షకులలో ఉద్రేకం కలిగించినా ఆనందం కలిగించినా మనమే కలిగించాలిరా.

[ఎడమవైపునుంచి మంగయ్య ప్రవేశిస్తాడు. వయస్సు 25 సంవత్సరాలు. విలువైన సూటు - వేళ్లకు ఉంగరాలు - రిస్టువాచీ, గొలుసు - చూడగానే ధనవంతుడని తెలుస్తుంది. అతన్ని చూడగానే - కళాధర్ సుధాకర్ - యిద్దరూ లేచి ఆహ్వానిస్తారు. సుభాషిణి రీవిగా కూర్చుని వుంటుంది]

సుధా: హల్లో! మంగయ్యగారు! ఏమిటిలా వచ్చారు? రండి! రండి! కూర్చోండి.

కళా: (కుర్చీ అటు లాగి) కూర్చోండి. (సుభాషిణితో) వీరు దివాన్ బహద్దర్ రంగయ్యగారి అబ్బాయి మంగయ్యగారు. (మంగయ్యతో) ఈమె మా శుభోదయా నాట్యమండలి పెర్మనెంటు హీరోయిన్ కుమారి సుభాషిణి.

సుభా: (లేచి మంగయ్యకేసి తిరిగి) నమస్కారం! (కూర్చుంటుంది)

మంగ: (సుభాషిణికేసి తిరిగి) నమస్కారం! (కూర్చుంటాడు)

సుధా: తమ రొచ్చిన పనేమిటో సెలవిస్తారూ మంగయ్యగారూ! ఏదో విశేషం లేనిదే మీ రిలా రారు.

మంగ: దయచేసి నన్ను మంగయ్యని పిలవకండి. నా పేరు మంగేశ్వర్రావు.

కళా: (అసలు వ్యవహారంలోకి వస్తూ) సరే! మంగేశ్వర్రావుగారూ! మీరు వచ్చిన పనేమిటి?

మంగ: రాత్రి మీరు ఆడిన "సంధ్యారాగం" నాటకం చూశాను. అద్భుతంగా వుంది. ఇటువంటి ఆదర్శ నాట్యమండలి డబ్బులేక యిబ్బంది పడుతున్నదని తెలిసి చాలా విచారించాను.

## ★ కళోద్ధారకులు ★

సుధా: నాటకానికి ముందు మా విజ్ఞప్తి కూడా మీరు విన్నారన్నమాట!

మంగ: ఆఁ! అది వినే మీకు నేను కొంత ధైర్యం కలిగించడంకోసం యిక్కడకు వచ్చాను. ఇక మీరు డబ్బుకోసం నిరుత్సాహపడకండి. నేను మీకు ఏదైనంత వరకూ డబ్బు సర్దుతూ వుంటాను.

సుధా: (సంతోషంతో) మన ఉపోద్ఘాతంవల్ల గుణం కనబడిందిరా కళాధర్!

కళా: (సంతోషంతో) మన కష్టానికి ప్రతిఫలం ఎప్పటికైనా దొరికితీరుతుందిరా సుధాకర్!

సుధా: చూడండి మంగేశ్వరరావుగారూ! మీరు కళాప్రియులని తెలిసి మేం ఉభయులం చాలా సంతోషిస్తున్నాం. మాలాటి దరిద్రులకు ఎన్ని ఆశయాలు వుంటే ఏం లాభం చెప్పండి! మీవంటివారు మా అండను వుంటే ఆంధ్ర నాటకరంగానికి ఆరు వారాలలో అమోఘమైన కీర్తి తీసుకురాగలం.

కళా: అంతే కాదు. ప్రజల అభిరుచిని మూడు నిముషాలలో నాటక కళమీదికి మళ్ళించగలం.

సుధా: (లేచి) ఇంతెందుకు? నాటకాల వల్ల ప్రజల్ని తన్మయుల్ని చేసెయ్యగలం!

కళా: (లేచి) అపూర్వమైన సంస్కారాల్ని ప్రజల బుర్రలలో ఎక్కించగలం.

సుధా: ప్రేక్షకుల గుండెల్ని కరిగించగలం!

కళా: నవ్వించగలం! ఇంకా ఏమైనా చెయ్యగలం.

(ఎడమవైపునుంచి శేషు వస్తాడు)

శేషు: ఏమిటి గురూ! ఇద్దరూ ఆవేశపూరితులై ఉపన్యసిస్తున్నారు? (మంగయ్యను చూసి) ఓహో! మంగయ్యగారూ! ఇలా వచ్చారేమిటి?

మంగ: (కోపంతో) మంగయ్యేమిటి? మంగేశ్వరరావు అనలేవూ?

శేషు: ఏమిటి? మంకేశ్వరరావా? ఇటువంటి పేరు ఎక్కడా వినలేదే! ఇంగ్లీషులో 'మంకీ' అన్న పేరు విన్నాను. అయితే ఇంగ్లీషుభాషలో వున్న 'మంకీ' పదానికి తెలుగుభాషలోవున్న 'ఈశ్వరుడు' పదానికి సంధి ఎలా కలిసిందా అని నాకు సంశయంగా వుంది.

సుధా: ఒరేయ్! శేషూ! నీ సంశయాన్ని ప్రస్తుతం ఆపుచేస్తే ఏమైనా ప్రమాదం వుందా?

---

శేషు: లేదు.

సుధా: అయితే ఆపు చెయ్యి.

మంగ: రాత్రి నాటకంలో సుభాషిణి పాడిన పాట యింకా నా మనసులో కదులుతున్నదంటే నమ్మండి! కుమారి సుభాషిణిచేత ఒక్కసారి ఆ పాట పాడిస్తారూ!

కళా: దానికేం? అలాగే వినండి! (సుభాషిణితో) అమ్మాయ్! మరోకసారి నీ పాట మంగయ్యగారికి వినిపించు. (శేషుతో) ఒరేయ్ శేషూ! మన నాట్యమండలికి ఆర్థిక సహాయం చెయ్యడానికి మంగయ్యగారు ఒప్పుకున్నారు. కనక మేం యిద్దరం బయట చెట్టుక్రింద కూర్చుని రేపటినుంచి పెద్దఎత్తులలో నాట్యమండలిని ఎలా నిర్వహించాలో చర్చించుకొని వస్తాం. నువ్వు యిక్కడే కదలకుండా కూర్చో!

(కళాధర్ సుధాకర్ జట్టాపట్టాలు వేసుకొని ఎడమవైపు వెళ్లిపోతారు)

శేషు: (తివాసీమీద కూర్చుని హార్మోనియం వాయిస్తూ) గురువాజ్ఞ! ఏదీ పాట ప్రారంభించు సుభాషిణీ!

(సుభాషిణి కొంచెం సంశయిస్తుంది.)

మంగ: పాడు! సుభాషిణీ! నాదగ్గర సంశయ మెందుకు?

సుభా: (లేచి ఉత్సాహంతో పాడుతుంది)

నాపాట వింటావా?
నాతో
నాట్యం చేస్తావా?
తీయని వలపులపాటా
ప్రణయానికి యిది బాట
మదిని కదిపే ఆట
గొందలో ఒక పూదోట
మదిలో మది కలిపి
గొందలో గొంద నిలిపి
జంటగ ఆటు పోదామా?
మింటి కెగసి పోదామా?
నాపాట వింటావా?
నాతో
నాట్యం చేస్తావా?

మంగ: అద్భుతంగావుంది పాట! నీపాట సినిమాపాటల్ని మించిపోయివుంది. రాత్రి నాటకంలో మరోపాట కార్మికుల్ని గురించి పాడేవు చూశావూ! అది విడిసినట్టు వుంది.

సుభా: ఆపాటే అందరూ బాగుందన్నారండి.

మంగ: విడిశారు! వాళ్లకేం తెలుసు పాటల మజా? నాకు చిన్నప్పటినుంచీ పాటలంటే ఎంతో యిష్టం. అందుకే నేను సినిమా కంపెనీ ఒకటి స్థాపించి ఒక చక్కని ప్రణయ చిత్రం తియ్యబోతున్నాను.

సుభా: (ఆశ్చర్యంతో) ఏమిటి? మీరు సినిమా తీస్తున్నారా?

మంగ: ఏం? నీకాశ్చర్యంగా వుందా? ఒకటేమిటి? కొన్ని వందల సినిమాలు తీయించగలను. అదికూడా వ్యాపారమేనని మానాన్నకు నచ్చజెపితే చివరకు సినిమా కంపెనీ స్థాపించడానికి ఒప్పుకున్నాడు. (గది పరికించిచూస్తూ) ఇదేమిటి చీకటికొట్టులా వుంది. ఇంతేనా? ఇంకా ఏమైనా గదులున్నాయా?

సుభా: ఇంకా వెనక రిహార్సల్సు వేసుకోవడానికి పెద్దహాలు, మరోగదీవున్నాయి. రండి! చూపిస్తాను!

(ముందు సుభాషిణి తరవాత మంగయ్య ఇద్దరివెనుకా అనుమానంగాచూస్తూ శేషు కుడివైపు వెళ్ళిపోతారు. క్షణం గది ఖాళీగా వుంటుంది. ఎడమవైపునుంచి కళాధర్ సుధాకర్ మాట్లాడుకుంటూ ప్రవేశిస్తారు.)

కళా: భారీ ఎత్తున రిహార్సల్సు జరగడానికి పెద్దమేడ ఒకటి అద్దెకు తీసుకోవాలి. ప్రతి నటుడికి ప్రతిఫలం యిస్తూ వుండాలి.

సుధా: అంతేకాదు. రిహార్సల్సు జరిగే సమయంలో కాఫీ ఫలహారాలు నటులందరికీ సరఫరా చెయ్యాలి. ఎవరైనా నటుడు కాని, కవికాని దరిద్రంతో బాధపడుతూ వుంటే మనం నాటకం ఆడి ఆ నాటకంవల్ల వచ్చే నికరాదాయాన్ని వాళ్ళకు యిచ్చి సహాయం చెయ్యాలి.

కళా: మనం శ్రమపడి సుభాషిణిని హీరోయిన్‌గా తయారుచేసినందుకు ప్రతిఫలం దక్కిందిరా! (కుడివైపునుంచి తొందరగా శేషు వస్తాడు.)

శేషు: కొంప మునిగింది!

సుధా: వెధవముఖం నువ్వూ! మళ్ళీ ఏదో నావుకబురు తెచ్చావ్?

కళా: ఏం జరిగిందో వేగం చెప్పరా!

శేషు: మంకేశ్వర్రావు సినిమా కంపెనీ పెడుతున్నాడట. దానికి సుభాషిణిని హీరోయిన్‌గా బుక్ చేసేశాడు. ఇద్దరూ రేపే విమానంమీద పట్నం వెళ్లిపోతారట!

సుధా: (కోపంతో) హారి! దొర్భాగ్యుడా! నాటకకళమీద ఎంతో ప్రేమ వున్నట్లు నటించి మన నాటకమండలికి చిచ్చు పెట్టడానికి పూనుకున్నాడూ?

కళా: (కోపంతో) ఒరేయ్ సుధాకర్! ముందు ఆ మంగయ్యగాణ్ణి యిక్కడినుంచి తరిమెయ్యకపోతే లాభంలేదు. పద!

(ఇద్దరూ ఆవేశంతో కుడివైపు వెళ్ళి చెరోక కర్ర తీసుకొని వస్తారు.)

సుధా: ఒరేయ్ కళాధర్! నువ్వు అటువైపునుంచి రా! నే నిటువైపునుంచి వస్తాను.

కళా: ఒరేయ్ సుధాకర్! తొందరపడి కర్ర గట్టిగా విసిరేవు గనక! వాడిని యిక్కడినుంచి గెంటెయ్యడమే మనకు కావలసింది.

(కుడివైపు సుధాకర్ ఎడమవైపు కళాధర్ తొందరగా వెళ్లిపోతారు. శేషు ఆశ్చర్యంతో చూస్తూవుంటాడు. రెండు నిముషాల తరవాత యిద్దరూ నిస్పృహతో కుడివైపునుంచి వస్తారు.)

కళా: (కూర్చుని నిరాశతో) మన కళాసౌధాలు కూలిపోయాయిరా సుధాకర్!

శేషు: (ఆతృతతో) ఏరీ వాళ్లు?

సుధా: (కూర్చుని నిరాశతో) ఎగిరిపోయారురా నాయనా! ఆ మంగయ్యగాడు మనకొంప తీశాడు.

కళా: (బాధగా) ఎంతో శ్రమపడి మనం సుబ్బుల్ని సుభాషిణిగా మార్చాం. ఆంధ్ర నాటకరంగానికి అద్భుతమైన కథానాయికని సృష్టించి యిచ్చాం. చివరకు మనకు దేశం యిచ్చిన ప్రతిఫలం యిదటరా సుధాకర్?

సుధా: ఒరేయ్ కళాధర్! మనం సుబ్బులుకు చదువు, నటన చెప్పాం కాని సంస్కారం ప్రపంచజ్ఞానం నేర్పలేకపోయాం. అందువల్లనే ఆమె మోసపోయి వెళ్లిపోయింది. ఇక కుమారి సుభాషిణికి ఒక నమస్కారం పెట్టేసి వూరుకో!

శేషు: (ఇంతవరకు ఆత్రంతోను, బాధగానూ వింటూ యిక భరించలేక) సుభాషిణిని నేను మనసారా ప్రేమించాను. ఆమెలేని యీ నాట్యమండలిలో నేను ఒక క్షణమైనా వుండలేను. (ఆవేశంతో) ఆ మంగయ్యగాడి బుర్ర రామకీర్తన పాడిస్తాను. తిరిగి సుభాషిణిని తీసుకురాకుండా నే నీ నాట్యమండలిలో అడుగు పెట్టను. (ఉద్రేకంతో ఎడమవైపు పోతాడు. కళాధర్ సుధాకర్ యిద్దరూ "శేషూ!" "శేషూ" అని పిలుస్తూ వుంటారు. - తెర.)



# అందమైన భార్య

## కొంతి కృష్ణమూర్తి

"అందమైన వస్తువు నిత్యానందకరం" అన్నాడు కీట్సు. అందంగా పుట్టడం ఒక వరం. సౌందర్యోపాసన కోసమే జీవిస్తారు కొందరు కళాహృదయులు. కళారాధనే వాళ్ల జీవితాశయం.

అందాన్ని పూర్తిగా నిర్వచించడం కష్టమే. దానివల్ల కలిగే ఆనందంకూడా అనుభవైకవేద్యమేకాని మాటల్లో చెప్పజాలినది కాదు.

రోడ్డుమీద ఒక సౌందర్యవతి పోతుంటే మన దృక్కులు వాటంతటవే నిల్చిపోతాయి. దాన్నే 'అరెస్టింగ్ బ్యూటీ' అంటాం. "అబ్బ! ఏంసౌందర్యం!" అని నివ్వెరబోతూ కళ్లతోనే అప్రయత్నంగా ఏదో ఆనందాన్ని గ్రోలడానికి ప్రయత్నిస్తాం! ఇది సాధారణమైన విషయమే!

అలాగే ఒక అందగాడు పోతుంటే స్త్రీలూ చూస్తారు - కాని మగవాడు చూసినట్లు చూసేంత పూర్తిధైర్యం యుగయుగాల్నుండి అణగద్రొక్కబడినవాళ్ల కుండదు. సిగ్గనే పరదాలో తరతరాలుగా వాళ్ళు దాచబడివుండడంవల్ల కనుకొలకుల్లోంచే చూసి ఆనందిస్తారంతే! ఎందువల్ల జరుగుతుందిది? వాళ్లేమనుకుంటారు? చూచేవాళ్లేలా భావిస్తారు? అనే ఆలోచనే తోచదు.

నగ్నసత్యంలాగే నగ్నచిత్రాలన్నా భయపడే మనుషులకీ కాలంలో ఈలోకంలో కొరతలేదు.

ఇంతో అంతో చిన్నప్పట్నించి చిత్రకళమీద అభిమానం వుండడంవల్ల అందమైన బొమ్మలన్నీ చిత్రించడం నేర్చుకున్నాను. వాటివల్లే సౌందర్యోపాసకుణ్ణవగలిగానని అనుకుంటా నిప్పటికీ. చిత్రాల్ని చూసి ఆనందించడం వేరు. అందమైన చిత్రాల్నీ, శిల్పాలనీ సృష్టించి ఆనందించడం వేరు! ఒక ఉత్తమమైన కథను సృష్టించినప్పుడు కలిగే అనిర్వచనీయానందంవంటిదే చిత్రకారులకికూడా కలుగుతుంది.

'అందమైన భార్యని పెళ్లిచేసుకోవాలి; జీవితాన్ని ఆనందదాయకం చేసుకోవాలి! ఆమెనే 'మోడల్'గా చేసుకుని ప్రపంచ ప్రఖ్యాతిపొందే చిత్రాల్ని చిత్రించ గలగాలి! అదే నా కనీసపు కోర్కె, ఆశయమూను!

ఆ ఆశయసాధనకి మామూలు కుటుంబాలనుండీ వచ్చే సాధారణపు పెళ్ళికూతుళ్లు పనికిరారు. వాళ్లు వాళ్లచాదస్తాలతో మన ఆశయాల్ని అర్థం చేసుకోకపోవడమే కాకుండా, మన్నికూడా అధఃపతనానికి లాగుతారు. అందుకని చదువుకుని, సంస్కారం కలిగి, మన ఆశయాల్లో ఏకీభవించే అమ్మాయై యుండాలి.

అన్ని హంగుల్నీ కలిగి కాలేజీవైఖరినే ఆరెండు మూడేళ్ళు మధ్య మార్చిన, "మిస్. కాలేజ్" అనదగిన విద్యార్థిని మా క్లాస్‌మేట్ రుక్మిణి! వివిధ కార్యక్రమాల్లో ముందుకొచ్చేచొరవకలిగినదీ, విద్యార్థులతో చనువుగామాట్లాడే సామర్థ్యం, సంస్కారం కలదీ అవడంవల్ల, రుక్మిణి నా స్వప్నలోకాలలో విహరించే ప్రేయసి అని అనుకున్నాను.

ఆ రోజుల్లో మా కాలేజీలో వైజ్ఞానిక సభలు జరుగుతున్నాయి. ఆ వేళ సాయంత్రం కవి సమ్మేళనం జరిగింది. దేశంలోని మహాకవులు, అభ్యుదయ కవులు, ప్రజా కవులు, ప్రచార కవులు, గేయ కవులు, గద్య పద్య కవులు, పాటలు వ్రాసే కవులూ, సినిమా కవులు, విమర్శక కవులు, 'పేరడీ' కవులు, శ్రీశ్రీ మార్కు కవులు అనేక రకాలవాళ్లొచ్చారు. వాళ్లని చూడ్డానికి, కావ్యశ్రవణానికి చాలామంది జనం గుమిగూడారు. చాలామంది మిత్రకవులకు అవకాశమియ్యక పోయినా సమావేశం ముగిసేటప్పటికి రాత్రి ఏ రెండో అయ్యే సూచనలు కనపడ్డాయి.

పది గంటలప్పుడు రుక్మిణి కొంతమంది చెలికత్తెలతో బయలుదేరింది. దానితో కొందరు సౌందర్యోపాసకుల సంఖ్య తగ్గి, సభ బాగా పల్చపడింది.

సైకిల్‌రిక్షామీద యింటికి బయలుదేరింది. నేనూ సైకిల్‌మీద వెంబడించాను. రిక్షావాణ్ని సాగనంపి గుమ్మంలో అడుగు పెట్టిందో లేదో, నేను చప్పున వెళ్ళి "రుక్మిణీ" అన్నాను యేదో వొకటి మాట్లాడి ఆ రాత్రే నిర్ణయించుకోవాలనే ఉద్దేశంతో.

"ఎవరు?" అంది వెంటనే వెనుతిరిగి.

నేను ప్రత్యక్షమయ్యాను, నాకీ జన్మలో ఇవ్వబడిన చిరునవ్వునూ, సంతోషాన్నంతనూ ఒకేసారి మొహంమీదికి తెచ్చుకుంటూ.

"ఏం కావాలి?" అంది.

"నీ ప్రేమ" అన్నాను, రెడీమేడ్ జవాబిస్తూ.

ఒక్క క్షణం ఆలోచించింది. నా మనస్సు సంతోషంతో గంతింది. కొప్పు కోక మానదు.

"రుక్మిణీ!" అని దగ్గరకు సమీపించాను- దవడ పగిలింది.

"ఇటువంటి వేషాలెప్పుడూ వెయ్యకు"

తర్వాత తలుపు మూసిన చప్పుడు వినపడింది.

## 2

"ఇంటర్ పాసయ్యాడు. పెళ్ళి చెయ్యాల్సిందే! ఎన్నో సంబంధాలు వొస్తున్నాయి" అని అమ్మ గొడవ చెయ్యసాగింది.

అంతవరకూ "అప్పుడే పెళ్లేమిటే?" అంటూ దాటుకుంటూ వొచ్చాను.

నాన్న "అవును, నిజమే!" అన్నాడు.

నా గుండెల్లో రాయి పడింది-'ఈసురో' మనే పిల్ల నెవర్నో అంటగడతార్రా, భగవంతుడా, అని.

నాన్న అంటే చాలా భయం. కాని అమ్మదగ్గర అంతులేని గారాబం. అందుకని అమ్మ చెవుల్లో వూదాను.

"వాళ్లట్రా! వాళ్లు మనకి కావల్సిన వాళ్లు కూడాను. మనం చేసుకుంటామంటే కళ్ళకద్దుకుని యిస్తారు. అయినా... పెళ్ళికూతుళ్లు కరువైనట్టు వాళ్లని మనం ప్రాధేయపడి అడగడం ఏమిటే?" అంది.

మర్నాడు స్నేహపు చూపులకని వెళ్లినట్టు వెళ్లింది. వాళ్ళెంతో మర్యాద చేశారుట. మాటల సందర్భంలోనే పెళ్ళిమాటలు కలిశాయుట. తర్వాత వాళ్ల నాన్న వచ్చి పెళ్లిచూపుల కాహ్వానించడం, తాంబూలాలు పుచ్చుకోడం అన్నీ కలలో వలె జరిగాయి......

రాత్రి పదకొండయింది. పెళ్లికూతురు జడలోని మల్లెపూలవాసన ప్రాణాలకు స్వర్గపుటంచుల చవిచూపిస్తోంది.

గుమ్మాన్ని పట్టుకు నుంచుంది, అందరూ వెళ్లాక వెనకాలేవెళ్లి భుజాలు పట్టుకున్నాను. విదలించుకోబోయిన రెండు చేతులూ దొరికాయి. అదోలా మెలితిరిగి, నావైపు తలొంచుకునే తిరిగింది. చేతుల గాజుల గలగల కిలకిల నవ్వినట్టు ధ్వనించింది. మల్లెపూల వాలుజడ తెల్లని చీరపైబడి వింతశోభని కలిగిస్తోంది.



కొమ్మలూ, రెమ్మలూ —ఫొటో: నీలంరాజు మురళీధర, మద్రాసు.

"ఎందుకీ ప్రణయకోపం? ఇంకా నీ అయిదువేళ్లగుర్తు మాయలేదు చూడు" అని చెంప చూపాను.

రుక్మిణి చిరునవ్వు నవ్వుతో ఓరగా కనుకొలుకుల్లోంచి చూసింది. అందులో ఆ వ్యక్తి పశ్చాత్తాపం ప్రకటిత మవసాగింది. చుట్టూ చెయ్యివేసి టేబిల్ వైపు నడిపించాను. ఎదటి అద్దంలో మా ప్రతిబింబాలు చూసుకుంటుంటే నాకు అదే లోకమో ననిపించింది. ఏ అప్సరసగాని శాపంవల్ల భూలోకంలో పుట్టి రుక్మిణిగా కాలేదు కద!

తర్వాత చెప్పింది: ఎంతోమంది విద్యార్థులూ, అధ్యాపకులూ విజ్ఞాపనల దగ్గరనుండి ప్రేమలేఖలవరకూ ఎన్నో శాపత్రయాలు పడి తనని మోసగించాలనుకునేవారని.

"వాళ్ల ఉద్దేశాల ప్రకారం స్త్రీకి హృదయం లేదు. స్త్రీ కూడా తములానే ఎవరినో ఒకరినే ప్రేమించి వైవాహిక జీవితాన్ని అభిలషించే మనిషికాదు. ఆదిమజాతి అనాగరిక ప్రజల్లా స్త్రీని ఒక క్రీడావస్తువుగానో, లేక, తక్కిన నిత్యావసర సామగ్రిలోని భాగంగానో భావిస్తారనుకుంటాను.

"మీరూ అదేరోజుల్లో నన్ను వెంబడించారు. అందరికీ యివ్వబడిన సమాధానమే మీకూ వచ్చింది. ఎంతగా హృదయంలో బాధపడకపోతే ఆ తుణిక నిర్ణయానికి వచ్చి మిమ్మల్ని ఎదురోక్కకలిగా ననుకుంటారు?

"నన్ను క్షమించండి! కాని...మీరు వేరువిధంగా నా ప్రేమని పొందదల్చినట్టయితే ఆ దుస్సంఘటన జరక్కపోయేది. ఆ నా చర్యకు తర్వాత రోజుల్లోని, మీ మౌనాన్ని చూశాక - నాలో నేను ఎంత పశ్చాత్తాపాగ్నితో వేగాననుకున్నారు?

"ఆయన ఎంత ప్రేమతో నన్ను వెంటాడాడో? ఎంతగా నిరాశ కలిగించానో? అని ఎంతో విచారించి ఆయనే నావాడయ్యేలా చూడమని ఎన్ని దేవుళ్ళకి మొక్కుకున్నానో?"

రుక్మిణి కళ్లు చెమ్మగిల్లాయి.

"అవును, నీ ప్రేమకోసమే నేను జన్మమెత్తింది. కష్టించి పొందిన ప్రేమే ఎక్కువ విలువైంది"

## 3

నాన్న ప్రమోషన్‌మీద మరో వూరు ట్రాన్స్‌ఫర్ అయ్యాడు. నన్ను చదువు నుండి కదపడం యిష్టంలేక మమ్మల్ని యిక్కడే వుంచి వొంటరిగా వెళ్ళి పనిలో చేరాడు.

నేను బి. ఏ. చదవసాగాను. రుక్మిణి చదువు చాలించింది. మొదటి ఏడు కనక అంత శ్రద్ధతీసుకోకపోయినా ఫర్వాలేదనే ధైర్యం. హాజరీవేయించుకుని ఎప్పుడూ ఇంటిదగ్గరే వుండేవాణ్ణి.

అమ్మకి ఆ స్తమానూ పనే. కొత్తకోడలు కదా అని రుక్మిణిని పనిచెయ్యనిచ్చేది కాదు. అమ్మయిచ్చిన స్వాతంత్ర్యంవల్ల రుక్మిణి ఎప్పుడూ నా సాన్నిధ్యంలో వుండేది. ఉండాలని నేనో శాసనంకూడా ప్రకటించాను.

"అదేం బాగుంటుందండీ. మీ అమ్మగారు వూరుకున్నా, పైవాళ్లేమనుకుంటారు?" అంది.

"వాళ్ళ మొహం!" అన్నాను.

పేకాట, కేరమ్సులతో కాలం గడిచేది.

# ★ అందమైన భార్య ★

మధ్యలో దెబ్బలాటలు, మళ్లీ వాళ్లకి జన్మలో సంబంధ మంటుండా అనుకునేటట్టు. అమ్మ తీర్పు చెప్పాలి! అమ్మ ఎలా చెబితే వాళ్ళదే ఆనాటి గెలుపు! నేను సాయంత్రంపూట చిత్రకళాభ్యాసం మానలేదు. ప్రస్తుతం నూనెరంగులతో కాన్వాస్లమీద చిత్రాలుగీయటం మొదలు పెట్టాను. రుక్మిణి అవి చేస్తున్నంతసేపూ, ఏమీ తోచక బ్రష్లూ, అవీ దాచి గోల చేసేది. ఒకనాడు ఎంత అడిగినా యివ్వలేదు. నాకు కోపం వచ్చింది.

"నువ్వింత కళాహృదయంలేనిదాని వనుకోలేదు. అసలీచిత్రకళారాధనే లేకపోతే నీ సౌందర్యానికి ముగ్ధుడనై, నీ ప్రేమకోసం తపించకపోదు నేనా? నీ భావాలిలా నాకు వ్యతిరేకమవబోతాయని కలలో కూడా తలవలేదు" అని కొంచెం కఠినత్వం తెచ్చిపెట్టుకొని అన్నాను.

రుక్మిణి కళ్లు నిండు గర్భిణీలైన మేఘాల్ని చవిచూశాయి. మౌనంగా అన్నింటినీ తిరిగి యిచ్చివేసింది. మళ్లీ వాటిజోలికి రాలేదు.

ఒకరోజున, మనసులో అన్నాళ్లూ దాచుకున్న మాట అన్నాను! "రుక్మిణీ! నీ చిత్రాలు చిత్రించాలని వుంది" అని.

"ఎందుకు?"

"నీ సౌందర్యం విలువ నువ్వు తెల్సుకో గలగడానికి"

"అది తెల్సుకున్నవారు మీ రున్నారుగా - చాల్లెండి"

మొత్తంమీద ఎలాగయితేనేం రుక్మిణిని ఓచిత్రం చిత్రించాను: మా దొడ్డిలోనున్న మామిడిచెట్టు నానుకుని నిలుచోబెట్టి. రుక్మిణి ఆచిత్రంలో ఓ వనలక్ష్మిలా తయారైంది. నామనసు సంతోషంతో పుప్పొంగిపోయింది, నా చిరకాలవాంఛ ఈడేరినందుకు.

కాని...రుక్మిణి ఆచిత్రంయొక్క గొప్పతనాన్ని గుర్తించకపోవడంతో నా హృదయానికి దెబ్బ తగిలినట్టయింది. పదిరోజుల శ్రమా వృధా అయిందనుకున్నాను.

నాకోరిక ఎరుకపర్చాను: నా చిత్రాలకి ఏవిధంగా మోడల్ గా వుండి, నా కళోపాసనకి తోడ్పడవల్సిందీ - నా జీవితాశయమంతా వివరిస్తూ.

వింటున్నకొద్దీ రుక్మిణి మొదలంటా వొణికిపోసాగింది. నేను ఆశ్చర్యంలో మునిగాను. ఆశాభంగం మనసుని కలిగించ సాగింది.

మర్నాడు ఆవిడే చెప్పింది: "మీ కళోపాసనకి నా సంపూర్ణ సహకారం, అభినందన వుంది. నేను ఎప్పటికీ మీదాన్నే. నా సౌందర్యం నా భర్తకి ఆనందాన్నిచ్చి, ఆయనకు అమితమైన ఆత్మీయురాలిగా అవడానికి నాకు తోడ్పడకలిగితే నా జీవితానికి అంతకంటె కావలిసిందేమీ లేదు. అదే నా జీవితాదర్శమూను.

"కాని ఒక్క విషయంలో నే మీతో నేను ఏకీభవించలేకపోతున్నాను. మీ కళారాధనలో నేను సహాయకురాల్ని కాగలనుగాని సాధనాన్ని కాలేను. మీరు అతి రూపవతి ననుకుంటున్నా నన్ను మీ చిత్రాల్లో చిత్రించి, తద్వారా ప్రజలకు సంతోషాన్నిచ్చి, పేరుప్రఖ్యాతులు పొందదల్చి వుండవచ్చు.

"భారతదేశంలో పుట్టిన మూలాన్నేమి లేక పెంపకంవల్ల నేమి నేను చవకబారు స్త్రీలలా మగజాతి నంతనీ ఆకర్షించి, పాదాక్రాంతులుగా చేసుకుందామనుకునే తత్వం కలదాన్నిగా తయారుకాలేదు. నాకు జీవితంతో ఈయబడిన గొప్పవరం సౌందర్యమని తెలుసు. దాని ద్వారా మీ కానందాన్ని చేకూర్చి నేనూ సుఖం పొందాలనే నా అభిలాష. అందుకనే, నేను మోడల్ గా పని చెయ్యలేను—క్షమించండి!"

ఒకమూల ఆశాసౌధం కూలిపోతున్నా, రుక్మిణి నా మనోనేత్రాన్ని తెరిచి జ్ఞానోదయం కలిగిస్తున్నట్టనిపించింది. అయితే ఈ చలనచిత్రాలద్వారానూ, ఇతర విధాల ప్రచారాన్ని ఆకాంక్షించే సౌందర్యవతులంతా చౌకబారుస్త్రీలేనా అనే భావన నాలో మొలకెత్తింది.

"అవును, నిజమే! రుక్మిణి నాపాలిటి జగన్మోహనమణి" అనుకున్నాను నాలో నేనే.

## 4

రోజులు ఎల్లకాలం ఒకరీతిగా దొర్లిపోవు - జీవితంలో వొడిదుడుకులు సముద్రపు పోటుపాటుల్లా వుంటాయి. అసలు జీవితమనే నాణానికి సుఖదుఃఖాలు బొమ్మబొరుసులూను.

నాన్న ఆకస్మికమరణం పొందడం, అమ్మ వైరాగ్యంలోకి దిగి పుణ్యక్షేత్ర సందర్శనాలకోసం, దేశపర్యటన మొదలెట్టడం క్రమంగా జరిగాయి.

నా కెప్పుడూ ఇన్సూరెన్సు కంపెనీ వాళ్ళు చెల్లించాల్సిన డబ్బు, పొలాలమీద శిస్తువసూలు, ఇళ్ల అద్దెలూ, నాన్నకి రావాల్సిన యితర బాకీలూ చూడ్డం మొదలైన వాటితో సరిపోయేది. రుక్మిణిమీద అనంత

మైన బాధ్యత, (గృహసామ్రాజ్య మహాచక్రవర్తినిత్వం) పడింది.

ఓ రోజున యిద్దరం తీరుబడిగా కూర్చున్నాం. మాటలుగా మారలేని ఆలోచనలేవో మా మనసుల్ని పాలన చేస్తున్నాయి.

పక్కింటివాళ్ళ రేడియోలోనుంచి "అందమే ఆనందం..." అని పాట వొస్తోంది. ఏదో జీవితాన్ని భారంగా గడుపుతున్నామన్న మాటేగాని మనసుల్లో ఆశించిన ఆనందపుఛాయల దరిదాపుల్లోకైనా చేరినట్టుగా తోచలేదు. రుక్మిణిని సాంఘికమర్యాదలు తెలిసిన స్త్రీగా తయారుచేసి విందులకూ, టీపార్టీలకూ, సినిమాలకూ, తీసుకుపోవాలని కుతూహలం ఎండిపోయి అణిగిపోయిన భావాల అట్టడుగున నుండి తిరిగి చిగిర్చసాగింది.

పై ఆశయాన్ని సాధించడానికి నాకు ఆకస్మికంగా దొరికిన స్వేచ్ఛ, ధనం కూడా ప్రోద్బలాన్నివ్వసాగాయి...

ఒక సంవత్సరం గడిచింది. అప్పుడు మా జీవితాన్ని చూసినవాళ్ళు మొదట మేము ఏవిధంగా ఉన్నదీ కూడా కనుక్కోలేరు.

పొద్దున్న ఏమాత్రం విశ్రాంతి వుంటుందో, ఏమో! మిగతా కాలమంతా ఎవరో మిత్రులు వస్తూనే వుంటారు. సాయంత్రం రెండు, మూడు బ్రిడ్జి టేబిల్సు తక్కువ కాకుండా సాగుతాయి. డాక్టరు రామారావు, డాక్టరు సుమతీ (వాళ్లిద్దరూ భార్యా భర్తలు) రామరాజు అనే రేడియో వ్యాపారస్థుడు, ప్రతిభావతనే ఓ స్కూలు మిస్ట్రెస్, మరో ఇద్దరు, ముగ్గురు నిరుద్యోగ శిఖామణులూ భాగస్వాములుగా వుండేవారు. సుమతిని పగలు చూస్తే రాత్రి దుస్వప్నం కలిగించేంత అనాకారిగా వుంటుంది.

ఇంక ఆదివారాలు, మిగతా సెలవు దినాలు వొస్తే రోజస్తమానూ చీట్లాట ఎడతెగకసాగేది. అప్పుడప్పుడు పిక్‌నిక్‌లూ, సినిమాలకు పోడాలూ అనివార్యంగా సాగేవి. ఆ భోజనాలు, ఆ హాస్యప్రయోగపు ఛలోక్తులూ, ఆ ఆనందం వర్ణించటం తరంకాదు.

రోజులలాగే దొర్లుతూవుంటే బాగుండేది. కాని రుక్మిణికి అకస్మాత్ గా టైఫాయిడ్ వచ్చింది.

రామారావు దంపతులు వైద్యం చెయ్యసాగారు. తక్కిన మిత్రులుకూడా వచ్చి చూచి పోయేవారు. నేను చాలాగంటల వరకు రుక్మిణికి సపర్యలు చేస్తూనే కూచునేవాణ్ని.

ఒకనాడు అలసటవల్ల విపరీతమైన తలనొప్పి వచ్చింది. నౌకరతో అమ్మగారికి సపర్యలు చేస్తోండమని చెప్పి గాలితాగందుకు బయటకుపోయాను.

దారిలో మిత్రులు కలవడంవల్ల తిరిగి వచ్చేటప్పటికి రాత్రి 10. దాటింది. రుక్మిణి మంచంమీద పడుక్కొని వుంది. పక్కన ఎవరో వ్యక్తి కుర్చీలో కూచున్నట్టు కనపడింది. వాళ్ళ మధ్య సంభాషణ జరుగుతున్నట్టుకూడా పొడగట్టింది. కాని చీకట్లో ఎవరో తెలీలేదు. నా గుండె కొట్టుకోసాగింది. పక్కగోడవద్ద దాగి మాటలు వినసాగాను. ఎప్పుడూ లేని దుర్బుద్ధి కలిగిందెందువల్లో!

"కొందరి జీవితాలిలాగే వుంటాయి!"

"......ఊఁ!"

"ఒక్కొక్కప్పుడు సృష్టిలో అనేక వస్తువులు తమ నిజమైన ప్రయోజనాన్ని నెరవేర్చకుండానే అడవిగాసిన వెన్నెలలా, బూడిదలో పోసిన పన్నీరులా, వృధా అవుతాయి."

"........."

"ఇదే ఇంకొకళ్ళయితేనా!"

"........."

"నెత్తిమీద పెట్టుకుని ఆరాధించేవారు. ఇలా తన స్త్రీ కానట్టు, సంబంధంలేనిదానిలా......"

ఒక నిట్టూర్పు.

"మీరు ఎప్పుడన్నా ఆయన్నసలు మనస్ఫూర్తిగా ప్రేమించారా?"

ఈ ప్రశ్న వినేటప్పటికి నా వొళ్లు మండిపోయింది. వెంటనే లేచి వెళ్ళి ఆ వ్యక్తి దవడ పగలగొడదామనిపించింది. గబగబా అడుగులేసుకుంటూ వెళ్లాను.

ఎవరదీ? నిశ్చేష్టుడ్నయ్యాను. నా ఆలోచనలు అకస్మాత్తుగా కట్టుబడిపోయాయి! ఎవరు??

డాక్టర్ సుమతి!

ఏం చెయ్యాలో తెలీలేదు. రుక్మిణివైపు చూశాను. కన్నీళ్లు చెంపలమీంచి ముత్యాల్లా దొర్లుతున్నాయి. నా నోట మాట రాలేదు.

"ఉష్!......అటు నడవండి!" సుమతి ఆజ్ఞాపించింది! హాలులోకి వొచ్చాం!

"ఇక్కడ కాదు; బయట"

తోటలోకి వెళ్ళాం. సిమెంట్ బెంచీమీద కూచున్నాం. వీధిలో విద్యుద్దీపపు కాంతి చెట్ల ఆకులమీద పడి, విరజిమ్మబడి మామీద పడుతోంది.

సుమతి అనసాగింది: "నేను వచ్చేటప్పటికి ఏడుస్తూ పడివుంది. ఎంత అడిగినా చెప్పలేదు. ఆవిడ అసలు సైకలాజికల్ గా నెర్వస్. మీరు ఆవిణ్ని సరిగా చదివినట్టు తోచదు. ఈ పేకాటలూ, పార్టీలూ అవీ నచ్చనట్టుంది. అందుకే ఆరోగ్యం కూడా దెబ్బతిన్నట్టుంది. రైలు పట్టాలమీదే నడవాలి కాని, దారి తప్పిపోరాదు. అలాగే కొంతమంది మనుషులు కూడా వారికి స్వభావసిద్ధమైన మార్గాల్లోనే జీవిస్తే సుఖించగలరు గాని, కృత్రిమ వాతావరణాన్ని చిరకాలం భరించలేరు. కొంతకాలం భరించినా, మానసికారోగ్యాన్ని, శారీరక సౌఖ్యాన్ని కూడా గోల్పోతారు.

"మీరు గమనించలేదు గాని—ఆవిడ ఎప్పుడో గుర్తించింది, ఈ 'స్నేహితులూ', తుక్కు మనుష్యులూ తన సౌందర్యారాధనకోసం, ఆస్వాదనకోసమే ఇక్కడ చేరుతున్నారు కాని - మీ స్నేహంమీద మోజువల్ల కాదని. ఏమీ అనుమానం లేకుండా నిర్మలంగా వుండే మీకు ఈ విషయాలన్నీ చెప్పి ఈర్ష్యాసూయలు కలగచెయ్యడమిష్టంలేక మనస్సులోనే బాధపడుతూ, సహించిందిన్నాళ్లు.

"ఇప్పటికింకైనా ఆ వేషాలన్నీ మాని, యథార్థాన్ని గ్రహించి, మీ యిద్దరి జీవితాల్ని సుఖతరం చేసుకోండి."

నేను నిశ్చేష్టుడ్నై నిలిచాను. నాకళ్లని కప్పి, అన్నాళ్లు నన్ను అజ్ఞానాంధకారంలో ఉంచిన నీలి మేఘాలన్నీ అకస్మాత్ గా విడిపోయినట్లయింది.

"భార్యా రూపవతీ..." అనే విషయం గుర్తుకొచ్చింది.

అందమైన భార్యలూ అందరి విషయాల్లోనూ శత్రువులు కాదు - కాని వాళ్ళ హృదయాల్నర్థం చేసుకోకుండా, భ్రమించి చుట్టూ చేరే 'మిత్రబృందమే' నిజమైన శత్రువులు అనుకున్నాను.

రుక్మిణి జ్వరం తగ్గడానికి మరో పక్షం పట్టింది. తర్వాత ఆ పూగు వదిలేశాను, శాశ్వతంగా. కొత్త పూళ్లో) బూజుపట్టిన భ్రమల్ని దులుపుతూ, మళ్ళీ కొత్త జీవితాన్ని ప్రారంభించసాగాను, నా అందమైన భార్య రుక్మిణితో.



# వనితాలోకం

## కొత్తవెలుగు: ఒక వ్యాఖ్య ★

కొమ్మూరి ఉషారాణి

బాపట్లనుంచి శ్రీమతి ఎస్. రుక్మిణమ్మగారు యిలా వ్రాస్తున్నారు.

'వనితాలోకం శీర్షికలోని వ్యాసాలను చదువుతున్నాను. స్త్రీలు యింకా 'కొత్త వెలుగు'ని చూడలేకుండా వున్నారనీ వ్యక్తి వికాసాన్ని పెంపొందించుకోవాలనీ అన్నారు. సమాజ దృష్ట్యా స్త్రీల పరిస్థితిలో మార్పు రావాలని అన్నారు. సమాజం అంటే మనుష్యుల చేత నిర్మితమయేదే కాదండీ! ముందు ఎవరికి వారు వారి జీవితాలను సరిదిద్దుకుని యిల్లు చక్కబెట్టుకుంటే సమాజం దానంతటదే బాగుపడుతుందని నా వుద్దేశం. స్త్రీలు పురుషులతో పాటు ఎంత సమానత్వాన్ని కోరుతున్నా జన్మతః వారికి వుండే కొన్ని లక్షణాలను, అవి మంచి అయితేనేం, చెడు అయితేనేం త్రోసిపుచ్చలేము కొన్ని పరిహద్దులని దాటి వారు ముందుకు రాలేరు. ఎం. ఏలు, ఎం. ఎస్సీలు చదువుకున్న స్త్రీలుగూడా వివాహాలు చేసుకుని స్థిరపడిపోతున్నారు. చదువువల్ల ప్రత్యక్షంగా లాభాలు కనుపించనంత మాత్రాన అది నిష్ఫలమనుకోవటం అవివేకమని కొందరు వాదిస్తున్నారు. ఇటీవల ఒక దినపత్రికలో 'Graduate wifes' అను సంపాదకీయం ఈ విషయాన్నే వ్యక్తంచేసింది. కానీ చదువుకున్న స్త్రీలు వాస్తవికంగా దీనిని సద్వినియోగం చేసుకోకపోవటమే కాదు అసలు వారిని గురించి మంచి అభిప్రాయము ఏర్పడుటలేదు. అధిక్షేపణలకు గురి అవటము, యిటు పల్లెలలోనూ అటు పట్టణాలలో గూడా నిరాదరణను పొందటము జరుగుతున్నది. నాకు తెలిసినంత వరకు చాలామంది చదువుకున్న స్త్రీలు సామాన్య స్త్రీలతో కలవలేకపోతున్నారు. ఉన్నత విద్య స్త్రీలకు అనవసరమనీ దానివల్ల హానే ఎక్కువ కలుగుతోందనీ అనటము పొరబాటే. కానీ ప్రస్తుతం వున్న పరిస్థితులకి కారణం ఏమిటంటారు?'

సమాజం అంటే మనుష్యుల చేత నిర్మితమయేదనీ, ముందు ఎవరికివారు వారి జీవితాలను సరిదిద్దుకుంటే సమాజం బాగుపడగలదనే విషయాన్ని ఎవరూ కాదనరు. కానీ ఆ 'చక్క దిద్దుకోవటం'అనే ఒక్క విషయాన్ని మరచిపోయారు. తమ బుద్ధికి ఎంత న్యాయంగా సబబుగా తోచినప్పటికీ కొన్ని 'సాంఘిక సంప్రదాయాలకి' విరుద్ధంగా జీవించటానికి భయపడటం మానవ సైజం. ఆ సంప్రదాయాలని ఎవరు నిర్మిం

వారు ఎందుకు ఆచరించాలి అని ప్రశ్నించుకుని కొత్తమార్గాలను అవలంబించటానికి జంకుతారు. సమాజ శక్తులకి లొంగకుండా క్రొత్త భావాలనుగానీ సంస్కరణలనుగానీ ఆదరించటానికి సామాన్యంగా ప్రజలు వెనక్కి తీస్తారు. సంస్కరణల ఆవశ్యకతను గ్రహించినా దానిని ఆచరించేవారు ఒక్కరైనా లేనంతకాలం మిగతావారు ముందుకు రారు. జన్మతః స్త్రీ పురుషులమధ్య తేడా ఉన్నమాట నిజమే. కానీ సామాన్యంగా స్త్రీలు వారికి ఆపాదించబడే కొన్ని లక్షణాలు ఎంత అన్యాయంగా వుంటున్నాయో తెలుసుకుంటే 'సరిహద్దులని' దాటి ముందుకి రాగలుగుతారు.

ఎం. ఏ లు, ఎమ్. ఎస్‌సీలు చదివిన స్త్రీలు వివాహాలు చేసుకోవటం మీకెందుకంత ఆశ్చర్యాన్ని కలిగిస్తోందో బోధపడటము లేదు. ఇక వారు ఆ చదువులని వాస్తవికంగా ఆచరణలో పెట్టలేకుండా వున్నారంటే, ఆదోషం వారి దెన్నటికీ కాదు. అవకాశాలు దొరకకపోవటమే ముఖ్యకారణం.

చదువుకున్న స్త్రీలు నిరాదరణను పొందుతున్నారనే దానికి ఎన్నో కారణాలున్నాయి. మీరు చెప్పినట్లు చదువుకున్న స్త్రీలు సామాన్య స్త్రీలతో కలవలేకపోటం వాస్తవమే. ఊహ తెలిసినప్పటినుంచి చదువులో కొట్టుకుపోయే ఒక యువతినే తీసుకుందాం. ఆమె అలవరచుకునే అభిరుచులు, భావాలు ఒకరకంగా వుంటాయి. ఆ యువతే పల్లె ప్రాంతాలకు పోయినప్పుడు పదిమంది సామాన్య స్త్రీలతో కలవలేకపోవటం సహజం. 'ఈ యేడు కందులు అసలే లేవు. ఆ మూల కాలవలో నీళ్ళు బొత్తిగా లేవు' అనే కబుర్లు ఆమెకు రుచించకపోవటమే కాదు, కుశల ప్రశ్నలైనా సరిగ్గా వేయటము చాతకాకపోవచ్చు. అంతమాత్రాన ఆమెను అపార్థం చేసుకోవడం ఉచితం కాదేమో.

చదువుకున్న స్త్రీలను సామాన్యంగా అపోహాకి గురిచేసే విచిత్రమైన విషయం మరొకటుంది. ఉన్నతవిద్య నభ్యసించిన కొందరు స్త్రీలు కొన్ని ప్రత్యేక విషయాలలోనే ఆసక్తిని పెంపొందించుకుంటారు. ఒకరకమైన సంభాషణలోనే పాల్గొనటానికి ఎక్కువ ఉత్సాహం కనబరుస్తారు. తత్ఫలితంగా స్త్రీల సాహచర్యంకంటె పురుషుల సాహచర్యాన్నే ఎక్కువ కోరతారు. అటువంటివారిని విమర్శించటం సులభమైనప్పటికీ కొంత సూక్ష్మంగా ఆలోచిస్తే అది వారి దోష మెన్నటికీ కాదు.

చదువుకున్న స్త్రీలు ఆదర్శ గృహిణులు కాలేకపోతున్నారనీ, సంసారజీవితం సులభంగా సమన్వయించుకోలేకపోతున్నారనీ కొందరు వాదిస్తున్నారు. స్త్రీలు ఎంత విద్య నభ్యసించినా 'ఆదర్శగృహిణి' గా జీవించాలనే ఆశయాన్ని విస్మరించకూడదు. వారికిలభించినవిద్య దానికి తోడ్పడాలేగాని భిన్నంగా పరిణమించకూడదు. ప్రస్తుతం స్త్రీలు నిరాదరణను పొందటానికీ అపోహాలకి గురి అవటానికి యిదిగూడా ఒక కారణమై యుండవచ్చు. కానీ సమాజంలో చదువుకున్న స్త్రీల పట్ల చాలామటుకు అన్యాయాలే జరుగుతున్నాయని ఒప్పుకోక తప్పదు.

డిగ్రీలంటే ఏదో వర్ణించలేని జుగుప్స, కళాశాలవిద్యయందె అసంతృప్తి ప్రకటించేవారు కొందరున్నారు. వారిని విశ్వకళాశాల శిక్షణ బూడిదలోపోసిన పన్నీ రెన్నటికీ కాదనీ, అది అందజేసే 'సంస్కార' మొకటున్నదనీ నమ్మించటం కష్టం. వాళే తరుచు చదువుతున్న స్త్రీలమీద దండెత్తుతూ వుంటారు.

సామాన్యంగా పండుగదినాల్లో రోడ్ల మీద కొత్తబట్టలతో నామాలతో హడావుడిగా తిరిగేవారిని పురోహితులనీ, ముఖానికి రంగుతో కార్లలో పోయే స్త్రీలను సినిమాతారలనీ వెంటనే గుర్తుపడతాము. అంతేకాదు చీరకట్టునిబట్టి ఒక యువతి బెంగాలీస్త్రీయనీ తమిళస్త్రీయనీ తెలుసుకుంటాము. ఈవిధంగానే ఆధునికయుగంలో చదువుకున్న స్త్రీలను కొందరు యిట్టే కనిపెట్టేస్తున్నారు. వారికి అచ్చుపోసినట్లు కొన్ని లక్షణాలుంటాయనీ అందుచే వారిని గుర్తించవచ్చుననే విచిత్రమైన అభిప్రాయాన్ని వెల్లడిస్తున్నారు.

అలంకరణనిబట్టి చదువుకున్న స్త్రీలను గుర్తించే మార్గాలు చాలా హాస్యాస్పదంగా పరిణమిస్తున్నాయి. ఏ పేరంటానికైనా, సమావేశానికైనా వెళ్ళినప్పుడు ఓ కొత్తరకం ఫ్యాషను చీరగానీ, రవికగాని, తలకట్టుగానీ ధరించిన స్త్రీని వెంటనే చదువుకున్న స్త్రీ అంటారు. ఆ మనిషికి ఏ మాత్రం అక్షరజ్ఞానం లేక, పొరుగువారిని చూచి అటువంటి అలంకరణకి పూనుకున్నా, ముందు చదువుకున్న స్త్రీయే అయ్యుండాలి, అందుకే అటువంటి అఘాయిత్యానికి పూనుకుంది, అనుకోవటం ఒక పరిపాటయిపోయింది. కాస్త పెదిమలకి రంగు, చేతిలో హాండ్ బాగ్ కనుపించగానే కాలేజీ విద్యార్థిని అంటారు.

సాధారణంగా మన చలనచిత్రాల్లో నాయకుని నాశనం చేసి నాయకిని కష్టాలపాలు చేసేది వేశ్య అయినా అవుతోంది లేదా చదువుకున్న స్త్రీ అయినా అవుతోంది. అంతేకాదు, వెగటు పుట్టించే దుస్తులు వేయించి, అసభ్యంగా ప్రవర్తింపజేసి, స్త్రీలకు అబ్బుతున్న చదువంతా ఆవిధంగా ఉపయోగపడుతోందని ధ్వనింపజేసే దృశ్యాలను చొప్పించటం చలనచిత్ర నిర్మాతలకు ఒక అలవాటయిపోయింది. ఒక స్త్రీకి విపరీతమైన అణకువ, సౌశీల్యాలున్నాయని నిరూపించటానికి నిదర్శనంగా, తద్వ్యతిరిక్తమైన ఒక చదువుకున్న స్త్రీ పాత్రను సృష్టిస్తున్నారు. ఇటువంటి భావాలను వెల్లడించే చిత్రాలు గానీ సాహిత్యం గానీ అట్టే కాలం ప్రజలని రంజింపజేయలేకపోవచ్చు. కానీ తాత్కాలికంగా దుష్ఫలితాలను కలిగించే ప్రమాదం వుంది.

సామాన్యంగా పురుషులలో చదువుకున్నవారి కెటువంటి ప్రత్యేక లక్షణాలని ఆపాదించటం గానీ, వేరుగా చూడడం గానీ జరగటము లేదు. రెండు డిగ్రీలు చేతబుచ్చుకుని, ఏళ్ళ తరబడి వుద్యోగాలు దొరక్క వీధులవెంబడి తిరిగినా వారికి సానుభూతి దొరుకుతుంది. ప్రవర్తనలో లోపముండి జీవితంలో పొరబాట్లు చేసినా 'ఏదో చదువుకున్నవాడు. మరీ అంత బొత్తిగా తీసిపారెయ్యకూడదు' అంటారు. బి. ఏ. చదువుకున్న పురుషుడు కిళ్ళీకొట్టు పెట్టుకున్నా, లేక స్వగ్రామం వెళ్ళి సేద్యం చేసుకుంటున్నా లోకం ఏమీ అనదు. అదే చదువుకున్న అమ్మాయిని 'ఏంచేస్తున్నా' వనడిగితే ఏమీ చేయటంలేదనో, లేక తల్లికి సాయంగా వుంటున్నాననో, సమాధానమిస్తే విమర్శిస్తారు.

చదువుకున్న స్త్రీలంతా అధిక్షేపణలకి గురిగావటము లేదు. సమాజంలో వారికి పూర్తిగా వ్యతిరేక ప్రచారం జరుగుతోందనీ అనలేము. కానీ కొందరి దృష్టిలో చదువుకున్న స్త్రీలు ఆక్రమించుకునే స్థానమటుకు చాలా విచిత్రంగా వుంటోంది. స్త్రీలు పురుషులతోబాటు విద్యాశిక్షణని పొందటం అసహజంగా భావించినంతకాలం వారిని వేరుచేసే మనస్తత్వం నశించదు; చదువుకున్న స్త్రీలకీ సామాన్య స్త్రీలకీ మధ్య అగాధాలు ఏర్పడతాయి. సన్నిహితులై పరస్పరం సహకరించుకునే అవకాశం తప్పిపోయి అనవసరమైన అపోహాలు కలుగుతాయి. ★



# త్రివిధ సంసారాలు

"మీరు సవాలక్ష చెప్పండి శంకరంగారూ! మగవాడు మగవాడే, ఆడది ఆడదే! అసలు దేవుడు సృష్టించేటప్పుడే మగవాడిని బలవంతుడిగానూ, ఆడదానిని బలహీనగానూ, సృష్టించాడు. సంసారంలో మగవాడిదే పైమాటగా వుంటుందిగాని ఆడదానిమాట ఎప్పుడూ చెల్లుబడిగాదు" అన్నాడు రామారావు.

"అంతేనండి శంకరంగారు ఆడవాళ్ళమాట ఆ వంటింటి నాలుగుగోడల మధ్యే చెల్లుతుందిగాని, మిగతా విషయాలలో వాళ్ళ మాటలకు విలువ ఇవ్వబడదు" అని వెంకటప్పయ్య రామారావుని సమర్థిస్తూ, శంకరంగారి మొహం చూస్తూ అన్నాడు.

"వాళ్ళు చెప్పిందే కాస్త సమంజసంగా కనుపిస్తోంది శంకరంగారూ! మీరు చెప్పింది కాస్త అతిశయోక్తిగానే వుంది" అని నరసింగరావు వ్యాఖ్య!

ఆవేళ ఆదివారం. వీరు ముగ్గురూ శంకరంగారింట్లో చేరారు. వారి ముగ్గురికన్నా శంకరంగారు పెద్దవారు, అనుభవశాలి. ప్రపంచాన్ని కాస్త చూసినవాడు. పెద్దల పుణ్యమా అంటూ ఏదో కాస్త సంపాయించి ఇచ్చిపోయారు. దాన్ని దుర్వినియోగం చేయకుండా తనకు సంబంధించినంతవరకు దర్జాగానే బ్రతికేవారు శంకరంగారు. మిగతా ముగ్గురూ గుమాస్తాలు. పగల్లా గానుగలో ఎద్దులాగా పనిచేసి అలసి ఇంటికి వచ్చేవారు. ఇంటికి రాగానే ఇన్ని వేడినీళ్లు పోసుకుని అన్నంతిని శంకరంగారింట్లో సమావేశమయేవారు. శంకరంగారు మంచి మాటకారి. ఏదన్నా చెప్పాలంటే చిన్న కథలాగా చెప్పకల సమర్థుడు. రాత్రి పదింటిదాకా ఆయన కబుర్లు విని ఆనందంతో ఇంటికిపోయి శుభ్రంగా నిద్రపోయేవారు. ఏనాడూ శంకరంగారి సిద్ధాంతాలకి గాని, ఆయన చెప్పే విషయాలకుగాని 'కాదు, మీరు చెప్పింది కొంచెం అసమంజసంగా వుందండీ' అని ఎఱుగరు. అసలే అలిసిసొలసి ఇంటికి వచ్చినవారు ఏదో కాలక్షేపానికని శంకరంగారింటికి వచ్చేవారేగాని ఆయనతో వాదించటానికి కాదు. అందులోను శంకరంగారు సామాన్యులుగారు. ఆయన సిద్ధాంతానికి వ్యతిరేకంగా ఎవరైనా మాట్లాడితే వారితో వాదించి వోడించిగాని సంతృప్తిపొందరు శంకరంగారు! ఆ సంగతి తెలిసే మన ముగ్గురు గుమాస్తామిత్రులు ఎప్పుడూ శంకరంగారికి ఎదురుచెప్పి ఎఱుగరు. కారణం? ఆయనతో వాదించే ఓపిక, శక్తి, ఉత్సాహం లేక! రోజూ ప్రశాంతంగా పోయే దర్బాలకి ఆరోజు అవాంతరం వచ్చింది. కారణం? ఆరోజు ఆదివారం కావటం చేత! ఆరోజు మన గుమాస్తా మిత్రులకి శెలవరోజు. ప్రొద్దున్నే తొమ్మిందింటికి లేచి, కాఫీ తాగి, అలా తిరిగివచ్చి, మధ్యాహ్నం భోంచేసి, నాలిగింటిదాకా నిద్రపోయి, తరువాత కాఫీత్రాగి, టాయిలెట్ అయి, పార్కుకి వెళ్ళి, ఇంటికొచ్చి వేణ్ణీళ్ళ స్నానంచేసి భోజనంముగించి, ఉల్లాసంగా, విలాసంగా, ఆనందంతో శంకరంగారింటికి వచ్చారు. ఆరోజు వారికి ప్రపంచంలో ఎవరికీ లేని ఉత్సాహం, ఓపిక, శక్తి వున్నయ్. దేనికయినా రోజు

**వేమూరి సుబ్రహ్మణ్యము**

రావాలంటారు. ఇవ్వాళ శంకరంగారి సిద్ధాంతానికి 'సవరణలూ' వచ్చినయ్! ఏదో మాటమీద శంకరంగారన్నారు "సంసారంలో ఎప్పుడూ పురుషుడిమాటే చెల్లుతుందని అనుకోనక్కరలేదు. ఒక్కొక్క సంసారంలో ఆడదానిమాటకూడా చెల్లుబడి అవుతుంది! కొన్ని సంసారాల్లో స్త్రీమాటకే ఎక్కువ విలువ వుంటుంది" దీనికి మన మిత్రులు పైవిధంగా తలోమాట తమ అభిప్రాయంగా సెలవిచ్చారు.

శంకరంగారు మళ్ళా అన్నారు "నేనామాట స్వానుభవంతోనే చెబుతున్నాను. స్త్రీమాట చెల్లుబడిఅయ్యే సంసారంలో గూడ శాంతి ఉంటుంది."

"అలాగయితే ఆ సంసారం బజారున పడాల్సిందే" అన్నాడు వెంకటప్పయ్య.

"అటువంటి కాపురం పట్టుమని పదేళ్లు కూడా సుఖంగా వుండదు", అన్నాడు నరసింగరావు.

"స్త్రీమాట చెల్లే సంసారంలో శాంతి, ఏం ఉంటుంది? ఆ సంసారం అనుకున పెద్ద కంతపడ్డ బోటులాగానే ఉంటుంది" అన్నాడు రామారావు.

"అదేమి తప్పుడు అభిప్రాయం! కేవలం స్త్రీ అధికారంవున్న సంసారం శాంతివంతంగానే ఉంటుంది. కేవలం పురుషుడి అధికారం కల సంసారం శాంతంగానే ఉంటుంది. అట్లా గాకుండా పురుషుడు, స్త్రీ, తమ యిష్టం ఒచ్చినట్లు చేస్తుంటే ఆ సంసారం నిజంగా నరకకూపం! నేను ఓసారి ప్రయాణంలో ఈ మూడురకాల సంసారాలు చూచాను. నిజంగా అదో గమ్మత్తయిన కథ" అంటూ శంకరంగారు కథ చెప్పడాని కుపక్రమించారు. శంకరంగారి కథంటే మనవాళ్లకి చాలా సరదా. అందుకనే ఏమీ మాట్లాడకుండా బుద్ధిమంతుల్లాగా కూర్చున్నారు.

*　　*　　*

భారతావనిలోని ముఖ్య పట్టణాలన్నీ చూశాను గాని హైదరాబాదు చూసే అదృష్టం నాకు కలుగలేదు. అందుకని ఓనాడు 'హైదరాబాదు చూడాలి' అనే అపూర్వమైన నిశ్చయానికి ఒచ్చాను. సికిందరాబాదులోనే మా అక్కయ్యవాళ్ళు కాపురం వుంటున్నారు. అక్కయ్యను చూసికూడ చాల రోజులయింది. ఆవిడను చూడాలని ఎందుకో నా మనస్సు ఆరాటపడుతోంది. చేసేపని, వెలగపెట్టే రాచకార్యం ఏమీ లేదు కనుక ఓ ముహూర్తంలో హైదరాబాదు వెడదామనుకొన్నాను రాజ్యం పురుడుకని పుట్టింటికెళ్ళింది. ఇంట్లో నాకేమీ తోచటంలేదు. అందుకని కావలసిన పైకం దగ్గిరా చేతబట్టుకొని హైదరాబాదు బయలుదేరాను. వెధవ బండి సికిందరాబాదు వెళ్ళేటప్పటికి రెండున్నర గంటలు లేటు. ముందుగానే వుత్తరం రాశాను గాబట్టి స్టేషనుకి బావ వొచ్చాడు. నన్ను చూడగానే బావ గబగబా నాదగ్గిరికి వచ్చాడు.

"అంతా కులాసేనా?" అని నేనడిగాను.

"ఆ! కులాసాగానే వున్నాం" జవాబిచ్చాడు బావ. మెల్లిగా సామాను దింపుకుని ఓటాంగాలో ఇంటికి బయలుదేరాం.

"వెధవబండి రెండున్నర గంటలు లేటోయ్" అన్నాను నేను.

"అసలీ బళ్లు ఎప్పుడూ ఇంతేనోయ్. లేటుకాందే రాకూడదని రైల్వేరూల్సులో ఒకటేమో ఖర్మం! ఎప్పుడూ సరిగా టైంకు రావు." అన్నాడు బావ.

ఇల్లుచేరాం. వాకిట్లో రాధ కూతురి నెత్తుకుని నిలుచుని వుంది. నన్ను చూడగానే బండిదగ్గరకు వచ్చింది!

"ఏరా ఇదేనా రావటం? ఇంత ఆలస్యమయిందేం?" అని అడిగింది.



"ఇదేనమ్మా రావటం. బండి రెండున్నర గంటలు లేటు" అన్నాను.

"సరే కాళ్లుకడుక్కో. మొహం కడుక్కున్నావా కాఫీ తాగుదువుగాని."

"మొహం కడుక్కోవటం అయిందే. ముందు స్నానాలగది చూపించు స్నానం చేయాలి" అన్నాను.

అందరం లోపలి కెళ్ళాం. కాఫీత్రాగి స్నానంచేసి లోపలికొస్తుంటే గదిలో మాటలు వినపడుతున్నాయ్.

"మరి వ్వాళ సెలవ పెట్టాల్సిందేనండి. రాకరాక తమ్ముడొస్తే ఆఫీసు కెళ్తానంటారేమిటి! ఆపాటి తెలియకపోతే ఎలాగండి! కాస్త మీరు కబుర్లు చెబుతూ కూర్చుంటే వన్నా వాడికి కాలక్షేపం అవుతుంది ఏం మగవారండీమీరు" అంటోంది రాధ.

"అదిగాదే, ఆఫీసుపని ఎక్కువగా వుంది. అన్నిటికన్నా ఆఫీసరు కరోకటకుడు. కబుర్లు చెప్పటానికి నువ్వున్నావుగా" అంటున్నాడు బావ.

"నేనన్నమాట కబుర్లు చెప్పేది. మగవారు మగవారూ కబుర్లు చెప్పుకొంటే ఎంత బాగుంటుంది? అయ్యోరాత! ఆమాత్రం తెలియదేమండీ?" అంది రాధ గట్టిగా.

"ఇవ్వాళ జీతం ఒస్తుంది తెలుసా" అన్నాడు బావ హుషారుగా.

"జీతంఒస్తుందా? చెప్పరేమండి. అయితే పొద్దున ఆఫీసుకు వెళ్ళి మధ్యాహ్నంనుండి మూడురోజులు సెలవ పెట్టండి. తెలుసా?" అంది రాధ అధికార స్వరంతో.

"అలాగే లేవే."

"సరే బజారుకెళ్ళి కూరగాయలు పట్టుకు రండి" అని సంచీ చేతికిచ్చింది. నేను లోపలి కెళ్లాను. బావ మాట్లాడకుండా బయలుదేరాడు.

"మా బావ కేవలం అమాయకులులా కంకరం. అన్నీ నేనే చెప్పాలి. మరి బయటి ప్రపంచంలో ఎలా నెగ్గుకొస్తున్నారో కాని" అంది రాధ నాతో.

బావ ఆఫీసుకెళ్ళి మధ్యాహ్నంనుండీ మూడురోజులు సెలవ పెట్టాడు. నాకు వాళ్ల వ్యవహారంచూస్తే ఆశ్చర్యం వేస్తోంది. రాధ మాట ప్రతివిషయంలోను చెల్లుతోంది. బావ అక్కయ్యమాట కెదురు చెప్పడు. మరి వాళ్ళ సంసారం ఎట్లా

(30-వ పేజీ చూడండి)

కేతినీడి భాస్కరరావు
స్కూల్ ఆఫ్ ఆర్ట్స విద్యార్థి)



అంగడి

తన్మయత

# ★ త్రివిధసంసారాలు ★

చేస్తున్నారో! అన్న అనుమానం నాకు కలిగింది. మధ్యాహ్నం రెండుగంటలవేళ అక్కయ్య బావతో అంటున్నది. "ఏమండి తమ్ముడికి వూరు చూపించిరండి. త్వరగా రావాలి సుమా. సినిమా కెడదాం. ఐదున్నరకే రండి." నేను బావ వూరుచూసి బావ ప్రొద్దులంమీద సరిగ్గా ఐదున్నరకే ఇంటికి వచ్చాం. "తొందరగా స్నానం కానియండి అన్నం వడ్డిస్తున్నాను" అంది రాధ మాతో. స్నానం చేసి భోజనానికి కూర్చున్నాం.

"ఏ సినిమా కెళదాం శంకరం"

"నీ యిష్టం" అన్నాను నేను.

"మీరు చెప్పండి" అంది రాధక్కయ్య బావతో.

"జైజాబావరాకి వెళదాం" అన్నాడు బావ.

"విధవ హిందీ సినిమా లేం బాగుంటయ్యేంది ఏదో నా తెలుగు సినిమా కెళదాం."

"సరే నీ యిష్టం" అన్నాడు బావ.

ఒక తెలుగు సినిమా చూసి ఇంటికి వచ్చాం.

రాధ మాకు ప్రక్కలు బయటవేసింది. నేను ప్రక్కమీద పడుకుని కళ్లుమూశాను. నేను నిద్రపోయినా ననుకున్నది కాబోలు రాధ బావతో —

""ఏమండీ జీతం ఏది" అంది.

"రేపిస్తాను గా"

"మధ్యాహ్నం ఎందు కివ్వలేదు"

"ఏదో మాట్లాడుకుంటుంటే ఎందుకులే అని వూరుకున్నాను. సరే గాని ఈనెల ఇరవై తీసుకుంటాను."

"ఏం? ఎందుకు? ఐదు రూపాయ లెక్కువ ఎందుకు? అదేం లాభం లేదు. మామూలుప్రకారమే పదిహేను తీసుకోండి"

"ఈసారికి మటుకు"

"అదేం లాభం లేదండి. ఇంట్లో ఎన్ని ఖర్చులున్నయో మీకేం తెలుసు? ఏదో నేను గాబట్టి ఎట్లాగో నెట్టుకొస్తున్నాను. మామూలు గా పదిహేను తీసుకొని మిగిలింది నాకివ్వండి" దాదాపుగ ఆజ్ఞాపిస్తున్నట్టుగా అంది రాధక్కయ్య బావతో. బావ కిక్కురుమనకుండా 'సరే' అన్నాడు.

ఓ వారంరోజులుండి సికిందరాబాదు, హైదరాబాదు పూర్తిగా చూసి మళ్ళీ ఇంటికి బయలుదేరాను. "శాస్త్ర వుత్తరాలు రాస్తుండరా శంకరం! రాజ్యంకూడ వచ్చి వుంటే బాగుండేది" అంది అక్కయ్య.

రైల్లో ప్రయాణం చేస్తున్నానన్న మాటేగాని నామనసంతా ఇంకా సికిందరాబాదు రాధక్కయ్య ఇంట్లోనే వున్నది. "ఇదేం సంసారం! భగవాన్ నీసృష్టి అద్భుతం. ఆడమాటే అధికారం చెలాయిస్తోంది. అయినా ఆ సంసారంలో కీచులాటలూ, పోట్లాటలూ లేవు. సంసారం శాంతివంతంగానే నడుస్తోంది" అనుకున్నాను. బెజవాడలో దిగాను మా కృష్ణన్నయ్యను చూడటానికి. కృష్ణ అంటే మా పెదనాన్నగారికొడుకు మా యిద్దరికీ మంచి స్నేహం వుంది.

అన్నయ్యా వాళ్లింటికెళ్లేటప్పటికి పదవుతుంది. ఆయనింకా అరుగుమీద కూర్చుని మొహం తోముకుంటున్నాడు. నన్ను చూడగానే

"ఏరా బ్రతికేవున్నావా!" అన్నాడు నవ్వుతూ.

"బ్రతికున్నయ్యా. క్షేమంగానే వచ్చా అంతం

పెట్టె ఓ వలభై ఏళ్లు ఆయుష్షు పొడిగించుకొని ఇప్పుడే వస్తున్నాను" అన్నాను నేను నవ్వుతూ.

"లేకపోతే మరేమిటిరా? అసలు నువ్వు ఈ ఉత్తరం రాసి ఎన్నాళ్లయింది?"

"తీరి కేదన్నయ్యా. అయినా తగని బద్ధకం అనుకో."

ఇంతలో ఒదిన శాంత బయటికొచ్చింది.

"ఏమయ్యా ఇదేనా రావటం! బయట నుంచే మాట్లాడుతున్నా వేమిటి. రా లోపలికి. అంతా కులాసేనా?" అంది. లోపలికెళ్లాను

కాఫీలు తాగుతున్నాం అన్నయ్యా నేను. ఒదిన వచ్చి అన్నది "ఏమండీ ఇంట్లో సామాను పట్టుకురావాలి."

"అయిందీ అప్పుడే వారం వొచ్చింది. ఏం తేవాలి"

"వీశ చింతపండు, వీశ పంచదార, అర పౌను కాఫీ పొడి, వీశన్నర నూని..."

"అయిందా దండకం. ఏదో చదువుకు పోతున్నావ్ ఇష్టం వచ్చినట్లు" అన్నాడన్నయ్య.

"అంత విసుక్కుంటా రేమండి"

"సంతోషించాగులే తెలివికి. నోరు మూసుకుని లోపలికెళ్ళి లేనివన్నీ ఓ కాగితంమీద రాసుకురా తీసుకొచ్చి తగలేస్తాను" అని అన్నయ్య అన్నాడు కోపంగా.

ఒదిన తలొంచుకొని వెళ్లింది.

"ఎందు కన్నయ్యా అంత కోప్పడతావు" అన్నాను నేను.

"నీకు తెలియదురా. ఆడవాళ్లని ఎంతలో వుంచాలో అంతలోనే వుంచాలి." అన్నాడు అన్నయ్య.

"నా కప్పుడు అనుమానం వేసింది: మా బావే మా రాధక్కయ్యతో ఇట్లా అని వుంటే ఏమయ్యేది? సమాధానం నేనే వూహించుకొన్నాను. "దండకం అంటా వేమిటి? మాట్లాడేదానిలో అర్థం వుండాలి. దండకం అయితే వంటింట్లో కెళ్ళి చూసుకోండి ఏం వున్నయ్యో ఏం లేవో. అంత బద్ధకం అయితే సంసారం చేసినట్లే. మాట్లాడకుండా చెప్పిన వేవో తప్పక తెండి" మా బావ కిక్కురుమనకుండా బజారు కెళ్ళేవాడు అని ఆలోచిస్తూ కూర్చున్నాను.

"ఏమిటిరా ఆలోచిస్తున్నావ్" అన్నాడన్నయ్య.

"ఏం లేదన్నయ్యా. అన్నట్లు సరోజ ఏదీ?"

"దానికి నార్సింగ్ స్కూల్ కదూ. ప్రొద్దున్నే వెళ్ళింది"

సాయంత్రం ఓ మిత్రునింటికి వెళ్ళా. వాడు భోంచేయమని బలవంతం చేయటం చేత అక్కడే భోంచేసి తొమ్మిదిన్నరకు ఇంటికి వచ్చాను. అన్నయ్యేదో అరుస్తున్నాడు "నా యిష్టం వచ్చిన సంబంధం సరోజనికి నిశ్చయం చేస్తాను. నీ సలహా విని నోరుమూసుకోవటమే. తెలిసిందా? తగుదునమ్మా అని ప్రతివిషయంలో తలదూర్చటద్దని నీకు ఎన్నిసార్లు గడ్డిపెట్టాను? మనిషికో మాట గొడ్డుకో దెబ్బ అన్నారు. బుద్ధి వుండక్కర్లా"

"నేనుమాత్రం ఏమన్నానండి. ఈ సంబంధంకంటే ఆ సంబంధం నచ్చిందన్నాను గాని" అని ఒదిన భయపడుతూ మెల్లిగా అంది.

"అసలు నువ్వెవరవు బాగులేదని చెప్పటానికి? నా యిష్టం. నాకు నచ్చింది. నిశ్చయించాను. నీసలహా చెప్పిన పని చేయటమే తెలిసిందా?" అని అన్నయ్య అన్నాడు. ఒదిన మాట్లాడలేదు. నేను చెప్పులు చప్పుడు చేసుకుంటూ లోపలి కెళ్లాను.

"భోజనానికి లేవయ్యా! అన్నయ్యకూడ నీకోసరం కని పెట్టుకూర్చున్నారు"

"నేనొక స్నేహితుడింట్లో భోంచేశా వొదినా"

"పోనీ మజ్జిగయ్యినా తాగుతాడు" అన్నాడన్నయ్య.

"అక్కరలేదమ్మా" అని నేనన్నాను.

నాలుగురోజులుండి స్వగ్రామానికి బయలుదేరాను. ఇంటర్ క్లాసులో ఎవరూ లేరు. నా ఆలోచనలకి అంతరాయం కలుగదు. "ఓ భగవంతుడా! ఆహా! ఏమి నీమాయ. ఎంత వ్యతిరేక పరిస్థితులుగల సంసారాలు. ఎంత శాంతమూర్తి మా వదిన. అందుకే ఆ సంసారం శాంతివంతంగా నడుస్తోంది. మా వొదిన కూడ మా 'రాధ'లాంటి దయితే ఆ సంసారం గతేంకాను? మా అన్నయ్య కోపానికి ఆవిడ శాంతానికి సరిపోయింది గాని లేకపోతే ఆ యింట్లో రోజుకొక అగ్నిపర్వతం బద్దలు కాదూ!" అని ఆలోచిస్తూ స్వగ్రామం చేరాను.

ఇంటికి వచ్చి ఈజీచైరులో ఏదో చదువుకొంటూ పడుకొన్నాను. కాసేపయిన తరువాత అకస్మాత్తుగా ప్రక్కింట్లోనుండి అరుపులు వినపడ్డయ్.

"ఆమాత్రం అడగటానికి మొగుణ్ణయిన నాకు అధికారం వుండా లేదా!" అంటూంది పురుషకంఠం.

"మీ అధికారం ప్రతివిషయంలోను చలాయిస్తే పడేవారెవరూ లేరు" అంతకంటే గట్టిగా అంటోంది స్త్రీకంఠం.

"పడివుండక ఊరికే పెటుకుంటావేం?"

"అదొక్కటే తక్కువ నా బ్రతుక్కి. అంతకంటే మీరు నిర్వాకం చేస్తారని ఎవరనుకొన్నారు? మావాళ్లు నా గొంతు అడ్డంగా కోశారు"

"నేను బుద్ధి గడ్డి తిని నిన్ను మెడకు కట్టుకున్నా. నీకంటే ఏ గొడ్డయినా నయమే. మరీ రోజూ ప్రాణం విసిగిస్తున్నావ్."

"అంత విసిగింపయినా నన్ను మాట. ఊ! అంటే తప్పు. ఆ! అంటే తప్పు ఈ యింట్లో. ఇల్లు మరీ నరకంగానే తయారయింది" అని ఏడవటం మొదలుపెట్టిందా ఇల్లాలు.

"ఛీ వెధవగొంప" అని గట్టిగా అరిచి మొగకంఠం బయటికి పోయింది.

తరువాత గంటదాకా ఇంట్లో చెంబులు నేలకేసికొట్టిన చప్పుడు వినపడుతున్నది.

నేను ఊరికి వెళ్ళేముందు వారు లేరు. ఈమధ్య వొచ్చారు గాబోలు. ఇదెక్కడి సంసారం! ఇది సంసారమా? లేక చేపల మార్కెట్టా? అని ఆశ్చర్యపోసాగాను. ఈ పదిహేనురోజుల్లో ఎన్ని విషయాలు చూశానో అనిపించింది. అని శంకరంగారు కథ ముగించారు.

ఇంతసేపటి నుంచి వింటూ వున్న రామారావు "మొదటి రెండు సంసారాల్లోను శాంతివుందని ఎట్లా చెప్పగలరు. అందులో ఎవరో ఒకరినోరు పెద్దదేనా?" అన్నాడు.

"ఒకరినోరు పెద్దదయితే ఫరవాలేదు. రెండో వారు సర్దుకుపోతుంటే ఎప్పుడు శాంతంగానే వుంటుంది. ఎంత మంట మండినా గాలి లేకపోతే ఆరిపోవాల్సిందేగా! ఎంత డబ్బుంటే ఏంలాభం, ఇంట్లో శాంతి లేకపోతే" అన్నాడు అనుభవశాలి శంకరంగారు.

మిత్రులు ముగ్గురు గడిచిపోయిన ఆదివారం "ఇంకా వుండగూడదా" అనుకుంటూ మర్నాటి ఆఫీసుపనిని తిట్టుకుంటూ ఇళ్ళకు పోవటానికి లేచారు. ★





# ★ స్త్రీల ఆత్మహత్యలు ★

ఇల్లిందల సరస్వతీదేవి

ఈమధ్య హైదరాబాదు మెడికో లీగల్ సొసైటీ సమావేశములో ఆత్మహత్యలను గురించిన ప్రసంగములో ఒక సభ్యుడు వాటి కారణాలను వివరించాడు. ఆ ప్రసంగాన్ని ఒక స్థానిక పత్రిక ప్రకటించింది. దానిలో ఆయన "ఆత్మహత్యలు గ్రామాలలో కంటె నగరాలలో ఎక్కువ. విదేశాలలో స్త్రీల వాటి కంటె పురుషులవి ఎక్కువయితే హైదరాబాదు నగరములో స్త్రీలవే ఎక్కువ. ఆత్మహత్యలు చేసుకొనేవారిలో కూడా 15 సంవత్సరాల వయసునుండి 20 సంవత్సరాల వయసుగలవారి సంఖ్య అధికముగా ఉన్నది. వీటిలో కొన్ని గృహచ్ఛిద్రాలవల్లను, కొన్ని న్యాయసమ్మతముగాని ప్రేమకలాపాలవల్లను, మరికొన్ని ఇతర కారణాలవల్లను జరిగా" యని అన్నారు.

స్త్రీల ఆత్మహత్యల విషయములో ఒక హైదరాబాదులోనే కాక - మరెక్కడ విచారించినా సామాన్యముగా పైన చెప్పబడిన కారణాలే కనబడుతూ ఉంటాయి.

గృహచ్ఛిద్రాలు స్త్రీలనుగాని పురుషులనుగాని చికాకుపరచి మనోవైకల్యము కలిగిస్తాయనటములో సందేహము లేదు. భర్తగాని, కుటుంబములోనివారుగాని, కఠినముగా మొండిగా వెనుక ముందు చూడకుండా ప్రవర్తించటమువల్ల కలిగే పరిణామాలలో ఆత్మహత్య ఘోరమైనది. వివాహమైన స్త్రీయొక్క ఆత్మహత్యకు పెనిమిటి పెట్టే బాధలు కారణము కావచ్చు. కొన్ని సందర్భాలలో పెనిమిటి అస్వతంత్రుడవటముచేత అత్తమామలు, బావమరదులు, తోటికోడళ్ళు, ఆడబిడ్డలు పెట్టే బాధలను పడలేక స్త్రీలు ఆత్మహత్య చేసుకోవటము కూడా సంభవమే.

నాగరికత, సభ్యత చాలా కుటుంబాలలో చెప్పుకోతగినంతగా అభివృద్ధి చెందలేదు. విద్యావంతులలో కూడా భార్యలను బాధించేవారున్నారు. ఉన్నతమైనవీ ఆధునిక దృక్పథముకలవీ అని అనిపించుకున్న కుటుంబాలలో కూడా కోడళ్ల పరిస్థితి మామూలుగానే ఉన్నది. విశాలదృక్పథము కలవారికి కూడా కుటుంబాలలో కలతలు వస్తూనే ఉన్నాయి. కుటుంబాలలో శాంతి సామరస్యాలు ఎంతవరకు నెలకొల్పబడవో అంతవరకు ఆరోగ్యకరమైన వాతావరణము ఉండదు. దేశపరిపాలనవలెనే కుటుంబ పరిపాలన కూడా క్లిష్టమయినదే. అందుకే అన్నారు పెద్దలు 'ఇంటగెలిచి రచ్చగెలవ' మని.

సాధారణముగా తల్లీ కూతుళ్ళకు, తండ్రీ కూతుళ్లకు మధ్య వచ్చే పేచీలు ఆర్థిక సంబంధమైనవి కావు - నైతికపు ఎల్లల దగ్గర వస్తూవుంటాయి. 'వీధివాకిలి ముఖము చూడకూడదు. మగవాళ్లతో కలిసి తిరగకూడదు. నవ్వకూడదు - కంటికి అందముగా కనబడే బట్టలను ధరించకూడదు' అని తలిదండ్రులు తమ పిల్లలను అనవసరముగా బాధించటము అన్యాయము. చిన్న వయసులో తలిదండ్రుల అర్థములేని నిర్బంధములు బాలికలకు మనోవైకల్యము కలిగించటమే కాకుండా, జీవితాశలను చంపివేస్తాయి. బాలికల మనస్తత్వము గ్రహించని తలిదండ్రులు తెగేవరకు లాగినందువల్ల కలిగే ఘోరపరిణామము ఆత్మహత్య. బిడ్డల చేత వయసున చెప్పి వినిపించలేని తలిదండ్రులు ఆవిషయము సంతతితో వదలిపెట్టటము ఉత్తమముగాని కాఠిన్యము వహించినందువల్ల లాభము ఏమాత్రము ఉండదు. కాలప్రవాహానికి ఎదురు ఈదాలనుకోవటము వెర్రితనమనిపించుకుంటుంది. కాలాన్ని దాని ప్రభావాన్ని అర్థము చేసుకొని, దానిని మన పరిస్థితుల కనుగుణముగా మలచుకొనే శక్తినీ, సామర్థ్యాన్నీ బాలికలకు బోధించాలి. కాని బిడ్డలతో వైరము తెచ్చుకొని జీవితాలలో సాధించేదేమీ ఉండదు. బిడ్డలు, తలిదండ్రులు సామరస్యములో జీవితసమస్యలను, విధానాలను పరిష్కరించుకోవటము ఆదర్శ కుటుంబ లక్షణము. ఏ పరిస్థితిలోగాని బిడ్డలను తమ చేతిలోనుండి జారనిచ్చుకోవటము తలిదండ్రులకు శ్రేయస్కరము కాదు.

న్యాయసమ్మతముగాని ప్రేమకలాపాలుకూడా స్త్రీల ఆత్మహత్యలకు దారితీస్తున్నాయి. వివాహితల న్యాయసమ్మతము కాని ప్రేమకలాపాలు ఆత్మహత్యలకు ఇక ముందునుంచీ దారితీయ నవసరము లేదు. పెనిమిటితో పొసగని స్త్రీ విడాకుల చట్టము నుపయోగించుకొంటుంది. అవివాహితల ప్రేమకలాపాలు ఒక్కొక్కసారి దారుణముగా పరిణమించుతూ ఉంటాయి. మాతకాబోతున్నానని గ్రహించిన స్త్రీ వివాహము చేసుకోవలసినదని పురుషుని తొందరపెట్టటానికి ఆరంభిస్తుంది. ఈ ప్రేమికుల మధ్య వివాహము జరగటానికి సామాన్యముగా రెండువైపులా అభ్యంతరాలు ఉంటూ ఉంటాయి. అతడు వివాహితుడయినా, బిడ్డలతండ్రి అయినా కావచ్చు - బ్రహ్మచారి అయితే తలిదండ్రులు సమ్మతి లభించకపోవచ్చు - లేక అతడికే ఈ ప్రేమను నమ్మి వివాహము చేసుకోవాలనే తలంపు లేకపోవచ్చు; తాత్కాలికముగా మనసు మొగ్గి జరిపిన సరససల్లాపాలను 'ప్రేమ' అని యువకుడు మనసార చెప్పుకోలేకపోవటము కూడా సంభవమే. దీనితో యువతీ యువకుల ఉత్సాహము అణగారిపోతుంది. ప్రకృతి చూపిన ఫలితమువల్ల యువకుడు ముఖము తప్పించడము - యువతి దిక్కుతోచక, పెద్దవారితో చెప్పుకోలేక ఆత్మహత్యకు పాల్పడటము జరుగుతున్నది. కొన్ని సందర్భాలలో ప్రేమ విఫలమైనందువల్ల కూడా స్త్రీలు ఆత్మహత్య చేసుకోవటము తటస్థించుచున్నది.

స్త్రీ హృదయము చాలా సరళమైనది. ఎంత గొప్పయింట పుట్టినా - ఎంత విద్య నేర్చినా - ఎంత స్వాతంత్ర్యప్రియ అయినా ఆమెలోని హృదయమాధుర్యము తీగలు సాగి అల్లుకొని పోవటానికి తగిన ఆధారము కొరకు ప్రాకులాడుతూ ఉంటుంది. దీనిలో వైఫల్యము కలిగితే ఎంత ధైర్యము కలవారికయినా హృదయము చెదరక మానదు. ప్రాణముకంటె అధికమనుకొన్న ప్రేమ విఫలమయితే బాలికలకది అవమానకరముగా తోచటములో ఆశ్చర్యము లేదు. బ్రతుకు భారమనిపించి ఆత్మహత్యే శరణ్యమనుకుంటారు.

యువతీయువకులు మనసు పడినచోట వివాహాలు పొసగని కారణాలలో వరకట్నాలు ముఖ్యమైనవి; దీని తరువాతది కులగోత్రాల సమస్య. యువతీయువకులు గాఢముగా ప్రేమించుకొని వివాహము చేసుకోదలచుకుంటే ఈ రెండు కారణాలు ఏమంత బలమైనవి కావు. వరకట్నాల మాటను స్మరించనైనా స్మరించకూడదు. కులగోత్రాల విషయములో పెద్దలు మనసుగట్టి చేసుకోవాలి. గుణము ప్రధానముకాని కులముకాదని సమాధానపడటము



పెద్దలకు శ్రేయస్కరము. సంఘసంస్కారానికి ఈరోజులలో వీరేశలింగం గారి కాలములోవలె ఉపన్యాసాలు ప్రహసనాలు అవసరములేదుకాని ఆ దృష్టి అవసరము. సంస్కారము ఏకాలానికయినా అవసరమే. ఎంత ఆధునికుడనుకొన్నా కుమారుడి ఎదుట తండ్రి సనాతనుడే. ఈ సంగతి జ్ఞాపకముంచుకుంటే అనేక కుటుంబాలలో శాంతి ఏర్పడుతుంది. ఇదేకాక - అమాయికలైన బాలికలు మోసగింపబడటముకూడా జరుగుతున్నది. బాలికలు తమ హృదయాల నంతచౌకగా అర్పించుకోవటము - మెరసేదంతా బంగారమని భ్రమించటము పొరబాటు. వరుని ఎన్నుకోవటములో తగిన బుద్ధికుశలతను బాలికలు పెంపొందించుకోవాలి. కాలము విచిత్రమైన మార్పును కోరుతుందో ఎవరూ చెప్పలేరు. ఒకకాలములో తలిదండ్రులు వరనిర్ణయము చేసినందువల్ల బాలికలకు అన్యాయము జరుగుతున్నదనుకొన్నాము. ఆ వివాహాలలో ఏ అంశాలు అన్యాయమనిపించుకున్నాయో - అవే యిప్పుడు బాలికలు ఏరికోరి తమకు తాము వరనిర్ణయము చేసుకొన్నవాటిలో కనబడుతున్నాయి. ఆ పద్ధతి అప్పుడు ప్రమాదకరముగాతోస్తే - ఇప్పుడు ఈపద్ధతి దారుణముగా కనబడుతున్నది. కనుక తలిదండ్రులు బిడ్డలు తమ మనోగతాలను కలబోసుకొని, ఒక నిర్ణయానికి రావటము అభ్యుదయకరము. అది ఉభయులకు సంతృప్తి నివ్వగలదు.

ఏ విషయములో గాని తలిదండ్రులకు బిడ్డలకు మధ్య అభిప్రాయభేదము తటస్థపడితే సర్దుబాటు చేసుకోవటము కుటుంబ క్షేమానికి ఉచితమైనది. అభిప్రాయ భేదాలు వ్యక్తుల మధ్య అగాధాలను సృష్టించరాదు. బిడ్డల క్షేమమును దృష్టిలో ఉంచుకొని - వారి మనఃప్రవృత్తుల కనుగుణముగా పెద్దలు సలహాలు యివ్వటము, సహకరించటము మంచిది.

కుటుంబములో సామరస్యము కలిగించి శాంతిని నెలకొల్పడము స్త్రీల చేతిలో వున్నది. ఇది స్త్రీల బాధ్యత. 'కూతురు చెడుగైన మాత తప్పు' అన్నారు అనుభవశాలురు. సామాన్యముగా బిడ్డల పెంపకములో బాల్యదశ దాటీ దాటని కాలము తలిదండ్రులకు పరీక్షా సమయము. ఈ కాలములోనే సహచరుల ప్రభావము పిల్లలమీద చాలా పడుతుంది. ఈ సమయములో తల్లి పిల్లలకు చాలా సన్నిహితురాలుగా మెలగాలి. సహచరులలో ఒకతెగా - ఎప్పటికప్పుడు పిల్లల మనోగతాలను తెలిసికొంటూ ఉండాలి. యౌవనారంభదశలో ఉన్న బిడ్డలకు తగిన శిక్షణ నివ్వటము సామాన్యమైన విషయము కాదు. సలహారూపమున అతి జాగ్రతతో పిల్లలకు బోధించతగిన కాలములో తలిదండ్రులు - ముఖ్యముగా తల్లి ఏమరి ఉండటము గాని, తన అధికారమును దుర్వినియోగపరచుకోవటము గాని కూడనివే. తన బిడ్డలు విద్యావంతులై - విజ్ఞానవంతులై ఒక యింటివాళ్ళయేవరకూ వాళ్ల బాధ్యత తల్లిదే. తన సంతానానికి సక్రమమైన శిక్షణ నిచ్చి ఆదర్శజీవులనుగా చేయటము తల్లి కర్తవ్యము. అందుకే స్త్రీని 'మాత' అన్నారు. ★

వనితాలోకం

# ఏలుబడి

(పెద్దకథ)

జి. పార్వతి

## 7

సుబ్బారావు పెండ్లి వైభవంగానే జరిగింది. మొగపెళ్లివారి తరఫున ఆండాళులాటి సాధ్వి వున్నది కాబట్టి పేచీలు రాకుండా కొనియాడతగిందిగా అయింది. పెళ్లికూతురు విశాలాక్షి విశాల నేత్రాలతో మొగపెళ్ళివారిల్లు కలయ చూసింది. రైలెక్కేంతవరకూ చాలా బాధ పడింది. ఆచార ప్రకారం తనతో వచ్చిన పిన్నతల్లినీ, తన ప్రియస్నేహితురాలు, మామయ్యకూతురూ ఐన పద్మను చూసేసరికి ఏమంత బాధనిపించలేదు.

విందుభోజనం అరగించిన ముత్తైదువలందరూ హాలులో పరచిన పెద్ద తివాసీ మీద ఆసీనులయ్యారు. లలిత ఒకొక్కరికీ తమలపాకులూ, వక్కపొడీ అందించింది. ఆండాళు తన తోటికోడలు పక్కగా చోటుచేసుకు కూర్చుని "ఒక పాట పాడి వినిపించాలి సుమా..." అని సభాసదులతో "మా తోటికోడలు బాగా పాడుతుందిట మీరంతా వినదల్చుకుంటే యిదే సమయం" అని నవ్వింది. విశాల వొళ్ళోకి చేతులు తీసుకుని తల అడ్డంగా ఆడించింది పాడటం యిష్టంలేనట్టు. పెళ్లికూతురు తరఫున పద్మ "పాటలు రావని చెప్పను గాని, వాళ్ల అక్కయ్యతో గాని పాడలేదు విశాల" అని జవాబిచ్చింది. ఆండాళు ఖంగారుగా లేచి "మీరంతా యిలా వుక్కలో నానిపోతున్నారే... వుండండి విసనకర్రలు తెప్పిస్తా"నని లేచి వెళ్ళింది. విసనకర్రలు చేతిలో ఆడుతున్నా అందరూ ఎవరి సంభాషణ వాళ్లు ప్రారంభించారు.

ఎదురింటి డాక్టరుగారి పెళ్ళాం పక్కావిడ చెవిలో "పెద్దకోడలు మాటకూడా కాదని ఎలా వూరుకుందో చూశారా?... పైగా చదువుకున్నదిట, యింక పట్టపగ్గా లుండవు" అని ఋగ్గని చేసుకుంది. ఇంజనీరుగారి భార్య జానకమ్మ లేచి పెళ్లికూతురు చేతిలో రవికలగుడ్డ పెట్టి కూర్చున్న వాళ్లకేసి చూస్తూ "నేను ఈ పెద్దావిడ వచ్చినప్పుడు పేరంటానికి వచ్చాను. కాని ఆ అత్తగారు పోయినా ఏ లోటుపాట్లూ రానీయకుండా ఈ యింటిని ఏలింతంటే ఆండాళు ఎలాటిదో ఆలోచించండి" అని "అలాటి కోడలుంటే ఏ యిల్లు శాంతిగా వుండదు?"...అని పెళ్లికూతురికేసి ఓరగా చూసి "నే వెళ్ళివస్తానమ్మ ఆండాళు..." అని చెయ్యి పట్టుకుని గుమ్మందాకా తీసికెళ్లింది. ముత్తానికి మరొక గంటకల్లా పేరంటాళ్ళంతా ఎవరి దార్ని వాళ్లు వెళ్ళిపోయారు. విశాల తన గదిలో స్థిరపడింది. లలిత పెద్ద ఒదినగార్ని సందేహం ఆపుకోలేక అడిగింది. "ఏం ఒదినా...మరి నువ్వు ఒదినవే ఆ పెళ్ళికూతురూ ఒదినే మరి అవిడ్ని ఎలా పిలవను?..." అని అడిగింది పెద్ద చిక్కు ప్రశ్నకి జవాబు తెలీనట్లు. ఒదిన నవ్వి ముంగురుల్ని సవరిస్తూ "చిన్న ఒదినా!...అని పిలు. అలానే పిలవాలి కాలాగే అది చిన్నన్నయ్య పెళ్ళాంగా నీకు..." అని జవాబిచ్చింది. ఆండాళు అనుకున్నట్టు తను ఇప్పుడు అత్తగారిస్థానే వున్నా తనకి అత్తగారు చేసిన విధులన్నీ నడపాలని వూహించింది. ఆ సాయంత్రం భర్తని పక్కకి పిలిచి "రేపు యిద్దరు కూలివాళ్ళని రమ్మనండి ఆ పందిరి పట్టి మంచాలు దాని గదిలో వెయ్యాలి" అని అంది. రంగారావు సందేహంగా "వున్న వేవో వుండకూడదూ...కావలిస్తే మరో రెండు కొత్తవే కొనొచ్చు"అని అన్నాడు.

"అలా వీల్లేదు. అత్తగారి తరువాత నాకైనప్పుడు అవి వాళ్ళ కెందుకు కాకూడదు?...యిది తెలిస్తే ఆ పిల్ల చాలా బాధపడుతుంది. అయినా యీ యింట్లో వుండే ప్రతి వస్తువు మనతో సమానభాగం తక్కిన యిద్దరికీ వుండాల్సిందే!..." అని తీర్పు చెప్పింది. రంగారావు గుడ్లప్పగించి చూస్తూ వుండిపోయాడు.

ఆ మర్నాడు రెండు మంచాలూ చిన్నతని గదిలో పెట్టారు. చిన్నతను ఒదిన గారితో అలాటి పిచ్చిపన్లు చేయొద్దని తను మేడమీదిగదిలో వుంటాననీ చెప్పాడు. ఆండాళు ఏమీ చెప్పలేకపోయింది. మేడమీది రెండు గదులూ ఖాళీగా వున్నా చదువుకునే రోజుల్లో సుబ్బారావు, రమణమూర్తి ఒక గదిలో వుంటూండేవారు. మరోకగదిలో విరిగిన మంచాలూ పనికిరాని పుస్తకాలూ అవీ వున్నాయి. కాని సుబ్బారావు చదువైన తరువాత మేడమీదే ఎక్కువగా వుంటున్నాడు. ఆండాళు చాలా చిన్నబోయింది. తను మధ్యగది తీసుకుని ప్రక్కనవున్న చెరొక గదిలోను తన తోటి కోడళ్లుంటారని వూహించింది. సుబ్బారావు ఈమాట అనటంతో తన మరిది, పెళ్లాం రావటంతో దూరమౌతున్నాడేమో అని బాధపడింది.

"అలాగేపోయి, నీ కెలా వీలో అలాగే కానియ్యి. రేపు రెండు కొత్తమంచాలు తెప్పించి మేడమీద గదిలో వేయిస్తాను" అని సర్దుకుంది. రంగారావు అంతా వింటూనే గుటకలు మింగుతూ సమాధానం కూడా చెప్పలేకపోయాడు.

విశాల గదిలో మంచంమీద కూర్చుని చదువుతోన్న నవల మూసిపెట్టి గుమ్మంలోంచే అందర్నీ తిలకించింది. బుజ్జిగాడు పిన్నతల్లి కేసి చూస్తూ నుంచుండిపోయాడు. మొదటిసారిగా విశాల పిల్లాడ్ని చేతిలోకి తీసుకుని "నీ పేరేమిటో చెప్పు నాకు..." అని అడిగింది. బుజ్జి చేతుల్ని విదిలించుకుంటూ "అమ్మదగ్గిరికి పోతా" అని అన్నాడు. విశాల పిల్లాడ్ని వాకిట్లోకి వదిలి మళ్ళా తన గదిలో కూర్చుండి పోయింది.



# ఏలుబడి



## 8

సుబ్బారావు తనస్థానం మేడమీద ఏర్పరచుకున్నాడు. విశాల వయ్యారంగా మెట్లు ఎక్కుతూ దిగుతూ రాణి వాసాన్ని అనుభవిస్తోంది. రెండుపూటలూ భోజనానికి వస్తుంది కిందికి. ఆ సమయానికి బుజ్జిగాడు కాని, శాంత గాని అక్కడుంటే వాళ్లని ఒకసారి ముద్దెట్టుకుని వెళుతుంది. పదిరోజులతరువాత తోటికోడలుతో ఒక అరగంటసేపుమాత్రం మాట్లాడింది. అండాళు భోజనాలు పనులు ముగించుకుని తప్పటడుగులతో తనదగ్గరకి వస్తోన్న శాంతని చూస్తూ ఆనందిస్తోంది. విశాల రావటంతో రమ్మని నవ్వింది. విశాల పక్కగా కూర్చుని పమిటను వేలుకు మెలివేస్తూ ఏదో చెప్ప బోయింది. ఇంతలో అండాళు తనే కల్పించుకుని "మీవాళ్లదగ్గర్నుంచి వుత్తరం వచ్చిందా?..." అని అడిగింది. విశాల జవాబుగా "వచ్చింది ... కాని మా అత్త కూతురు పెండ్లి అవుతుందిట నన్ను రమ్మని రాశారు. మా మరిది ఏదో వుద్యోగానికి అప్లై చేశారుట, దానివిషయం తేలందే వెళ్లడానికి సందేహిస్తున్నా అక్కయ్యా! ..." అని అంది. అండాళు తనకావిషయం తెలీనట్లు ధోరణిమార్చి "మీరు మీదికిటికీకి చిన్న తెర కట్టుకుంటే బాగుంటుందమ్మా దుమ్ము అది చేరదు" అంది. విశాల "ఔ" నన్నట్టు తల వూపింది. ఏది ఎలా వున్నా అండాళు ఆలోచనలే వేరు. తనకి తెలీనివిషయం, యిష్టంలేని విషయం ఎదటి వాళ్లు మాటాడితే ధోరణిమార్చి మాట్లాడు తుంది. ఆ నేర్పు అందరికీ వుండదను కుంటా!...

లలిత నూని దువ్వెన తెచ్చుకుని పెద్ద ఒదినగారిని జడ వేయమంది. విశాల దువ్వెన అందుకుని "నే వేస్తానమ్మ లలితా..." అని అంది. అండాళు నవ్వు తూనే "చిన్న ఒదిన వేస్తుందిట వేయించుకో" అని అంది. ఇంతలో సుబ్బారావు వచ్చి "ఇవాళ చిన్న ఒదిన కాఫీ కల్పుతుందే లల్లూ...మీరంతా చూస్తూం డండి" అని అన్నాడు ఆక్షేపణగా. విశాల పమిట సవరించుకుని "నాకు లలిత కల్పిందే కావాలి" అని అంది. పెద్దావిడ శాంతని చంక నేసుకుని "ఏమే నువ్వు కల్పే మాట యితే మీబావగారిని ఇప్పుడే లెమ్మంటా" అని అంది. విశాల, సుబ్బారావు పది రోజులలో యింత మారటానికి కారణం తెలీ లేదు అండాళుకి. బుజ్జిగాడు పలక పుల్ల తీసుకుని "బాబూ!...నాకు ఆ, పూలు రాసియ్యవు?" అని అడిగాడు

"ఒదినా!...వీడికి ఈ ఏడు అక్షరాభ్యాసం చెయ్యాలమ్మా.." అన్నాడు. ఒదినగారు శాంతను జోకొడుతూ "ఏదో మాష్టర్ని పిలిచి ప్రారంభించటమే కాని అలాటివి ఏవి జరగనక్కరలేదు" అని అంది. సుబ్బారావు నవ్వుతూ "ఒరేయి బుజ్జీ నువ్వు పిన్నిలా చదువుకోవాలి, తరువాత పిన్నిని నీకు మాష్టరుగా నియమించా. ఆ,...విశాల! నీకు జీతం ఎంతో చెప్ప రేపట్నుంచి మా బుజ్జిగాడికి చదువు చెప్పాలి" అని అన్నాడు. విశాల ముఖం చిట్లించి "నా చదువు ఒకళ్ళకు చెప్పేందుకు చెప్పించలేదు మా అమ్మా నాన్నాను" అని అంది కోపంగా. సుబ్బారావు మరీ హేళనగా నవ్వుతూ "చదివే వాళ్లందరూ మేష్టర్లవాలని శాస్త్రమేముంది?...పాపం, నీ చదువు ఎందుకూ కొరకాదేమోనని అలా అన్నాను" అని అన్నాడు.

ఇంక పరిస్థితి బాగులేదని గ్రహించి అండాళు మరిదతో "మీ రివాళ సినిమాకి గాని దేనికైనా వెడితే వెళ్లండి. ఏదో మంచి సినిమా వచ్చిందని చెప్పింది వంటావిడ" అని అంది. "ఈ వంటావిడ ఎక్కడ్నించి దాపరించిందమ్మా ... మనకి... వంటవిషయం కాక ప్రపంచ విషయాలు కూడా తెలుసు కాబోలే" అని అన్నాడు. విశాల ఈ సందట్లో మేడమీదికి వెళ్లిపోయింది. ఆ మధ్యాహ్నం అలా ఎందుకు జరిగిందీ అంతు తెలీలేదు అండాళుకి. సాయంత్రం కొత్త భార్యాభర్తలు సినిమాకి వెళ్ళారు. బుజ్జిగాడు కూడా పోతానని మారాం చేశాడు. లలిత పైకి ఏడువక పోయినా కోపంగావుంది. ఒదిన యిద్దర్నీ గదిలోకి పిలిచి బుజ్జిగాడ్ని చంకనెత్తుకుని "పిన్నీ బాబు పోయే సినిమాలో పులులూ, సింహాలూ వున్నాయిటరా...మరి అవి పిల్లల్ని చూసి కరుస్తాయిట. అంచేత నువ్వూ లలితా రేపు రమణబాబుతో పోదురుగాని" అని అంది. లలిత ఏడ్పు నాపుకుని "రమణ ఎప్పుడు వస్తాడో యింకాను ఈ అన్నయ్య యింత బాగా తీసికెళ్ళాడా యింక వాడు తీసికెడతాడు" అని అంది. ఒదిన లలిత మొహంలోకి చూస్తూ మూడు అమ్మాయి,.. వాళ్ళు మొగుడూ పెళ్లామూను ఏం, మరి అలాటప్పుడు నువ్వూ బుజ్జి పోతామంటే మిమ్మల్ని ఎలా తీసికెడతారు? బుజ్జిగాడు నిద్రపోతాడు నువ్వు వుండలేవేమోను. ఇలాటివి నీ వయసుపిల్ల ఆలోచించుకోవాలి గాని బుజ్జిగాడికన్న చిన్నదానివైతే ఎలాగమ్మా?..."అని అంది.

## 9

పదునూడేళ్ళ లలితను చూసేసరికి అండాళు కన్నతల్లికన్నా ఎక్కువ బాధపడింది. మెట్రిక్యులేషను (అంటే మన వాళ్లు స్కూలు ఫైనలుకు కూడా ఆ ముక్కే అంటారు) కి రెండు క్లాసులు తక్కువ చదువుతోంది. తన తోటికోడలులా పెద్ద చదువు చదివించాలో లేక పెళ్ళి చేయాలో తెలీ లేదు. మామగారు ఏదీ చెప్పరు ఏ విషయం పట్టించుకోరు. ఇంక ఎవరి సలహా తీసుకోవాలి? ఆ రాత్రల్లా బాధపడింది. మొగుడికి తన సందేహం వెల్లడి చేసింది. రంగారావు మంచినీళ్లు తాగుతూ "దానికి యిప్పుడేం తొందర!...మన చిన్నాడి పెళ్లానికి పద్దెనిమిదేండ్లదాకా కాలేదుగా..." అని అన్నాడు. కాని అండాళు అంత సులువుగా ఆలోచించ లేదు. ఇలాటి తల్లిలేని పిల్లని యింట్లో ఎన్నాళ్లు అట్టే పెట్టుకుంటుంది. తన అత్త గారిలాగే తనూ...భయమేసింది. బుజ్జిగాడి కేసి, శాంత కేసి బాధగా చూసింది. "ఓయి భగవానుడా!...యీ యింటికి యింకా ఎన్ని అపసవ్యాలు చేయదల్చావో?..." అని కుమిలింది.

మళ్ళా రంగారావుగారు పెద్ద కవరు చించి లోపలి ఉత్తరాన్ని చదివేసరికి నిశ్చేష్టుడైనాడు. వుత్తరాన్ని తండ్రిచేతికిచ్చి "రామం మావయ్య యిన్నాళ్లకి మనమాట జ్ఞాపకం పెట్టుకుని వుత్తరం రాశాడే!..." అని "అమ్మపోయినప్పుడు కూడా మనం ఏ కష్టంలో వున్నది గ్రహించలేదు" అన్నాడు. శర్మగారు వుత్తరాన్ని చదివి "పిచ్చిగాని, వాడు చెల్లెలు బతికున్నప్పుడే మన్ని లెక్క చేయనప్పుడు అది లేక పోతే వుంటుందిట్రా...వచ్చే వాళ్లకి మర్యాద లోటుచేయకపోవటం మనవిధి" అని కొడుకుని సమాధాన పర్చారు.

రామారావుగారు పెళ్ళాంతోను, సినిమా స్టార్లుకన్నా సున్నితమైన కుమార్తె లక్ష్మితోను బండి దిగారు. బండిదిగడంలో నలిగిన పమిటను సవరించుకుంటూ వెళ్ళి మామయ్యకాళ్లకి నమస్కారం చేసింది. అండాళు హాలులోని గోడకి చేరగిలపడి చూస్తూ నుంచుండి పోయింది. రామారావు పెళ్ళాం కాలిని యింటి పెద్దకోడల్ని చూసి చిరునవ్వు విసిరింది పూర్వపు విచారాలు మాసిపోయినట్టు. అండాళు అత్తగారు పోయినరోజున ఎంత బాధపడిందో మళ్ళీ అలాటి వేదన పడసాగింది. పైగా యింటికి వచ్చిన వ్యక్తి అంత అసభ్యంగా అంటే



కష్టాన్ని గ్రహించి కూడా దాన్ని ఎత్తక పోవటంతో చాలా చిరాకనిపించింది మనసుకి. రామారావు బావగారితోను మేనల్లుడితోను ఏదో మాట్లాడుతున్నారు. అండాళు నేలచూపుల్తో సమాధానమిచ్చింది. ఇదంతా గ్రహించినశాలిని "అమ్మాయి! ... నువ్వు చిక్కిపోవటంతో నీమనసు ఎంత పరితాపం పొందిందో తెలుస్తూనేవుందమ్మా, యింతకీ అవిడిచ్చిపోయిన ఆ లలితని రమణని కొస్త స్థిరపడేదాకా కాస్తివా నీ అత్తగారు పరలోకంనుంచే ఆనందిస్తుంది." అని ప్రార్ధించింది.

అండాళు ఎప్పుడూ తెలీని ఫేషన్లతో మిరుమిట్లు గొల్పుతోన్న లక్ష్మిని, తల్లిని చూసి చాలా ఆశ్చర్యపడింది. భోజనాల తరువాత మధ్యాహ్నం అందరూ హాలులో కూర్చున్నారు. రమణమూర్తి సెలవులకి వచ్చి రెండురోజులయింది కాబోలు ఈ కొత్త చుట్టాల్ని చూసేసరికి కొంత లోపల విసుక్కున్నాడు. ఇంక శాలిని మొదలెట్టింది కలకత్తా గొప్పలు. "అమ్మాయి,...చూడు మా పిల్ల బి. ఏ. ప్యాసయేవరకూ మీ బాబుగారు వూరు కదలనన్నారు. ఏమిటో ఆడబిడ్డ పోయి మీరింత కష్టంలో వున్నా ఒక్క వుత్తరం ముక్క కూడా రాయలేకపోయారు. ఎప్పుడూ ఏదో ఆఫీసు పనితో తీరిక వుండదమ్మా. అంతా దైవాధీనం ఏది ఎలా కావాలో అలానే అవుతుంది" అని అంది. అండాళు వేళ్లు విరుస్తూ "అయితే లక్ష్మి బి. ఏ. ప్యాసయిందా?..." అని వూరుకుంది. "అదే ప్యాసయింది. యింకా చదువుతానంటే వద్దని వారించాను. మన కుటుంబాల్లో అంతలేసి చదువు లెందుకమ్మా!" అని అంది. అండాళు వికటంగా నవ్వి "అయితే లక్ష్మి ప్యాసయిన బి. ఏ. చదువులో లెఖ్ఖ కాదంటారా?...అయిదవ క్లాసు ప్యాసవని నాకన్నా చదివిందేగా!" అని అంది. లక్ష్మి చదివే పుస్తకాన్ని దాచేసి "పెద్దక్కయ్యకన్నా, చిన్నక్కయ్య ఎక్కువ చదివిందనుకుంటా అమ్మా!...మగైతే మన వూరుకన్నా ఈ వూళ్లో చదువుకునేవాళ్లు, తక్కువనుకుంటానే" అని అంది. అండాళు నవ్వుతూ "ఎందుకు కాదమ్మా...మీ వూరు కలకత్తా ఎంత బస్తీయో మనుష్యులు కూడా అంత నాగరీకులే మరి ఈ వూళ్లో మావంటివాళ్ల సంఖ్యే ఎక్కువ" అని అంది. మొత్తానికి అండాళు వచ్చిన చుట్టాలతో ఆ సాయంత్రందాకా వాదిస్తూనే వుంది. ఎఫ్. ఏ. ప్యాసైన విశాల, బి. ఏ. ప్యాసైన లక్ష్మి స్నేహాన్ని కలుపుకున్నారు. లక్ష్మికి పెద్దావిడకన్నా చిన్నావిడ ఎక్కువ నచ్చింది.

"చిన్నక్కా!...యిక్కడివాళ్లు కొళ్ళకి ఏదో అన్‌నేచురల్ కలర్‌గా కన్పించే ఆ పసుపులో పలపరికిణీ లేకుండా చీర ఇవన్నీ ఎందుకు అలవాటు చేసుకున్నారో తెలీదు. ఏది ఎలావున్నా నాకిలాటి ఆచారాలు నచ్చమంట" అని తన బస్తీతనాన్ని వ్యక్తపరిచింది. విశాల నివ్వెరపోయింది. అలాటి ఎత్తిపొడుపు మాటలు ఎవర్ని అంటోందో గ్రహించేందుకు ఆట్టేసేపు పట్టలేదు. పక్కనించి వింటున్న సుబ్బారావు, రమణమూర్తి విశాల నోటివెంట వచ్చే మాటకోసం వేచివున్నారు. రమణమూర్తి గుటకమింగి "ఈ పక్కా బస్తీపిల్లవచ్చి కొంప ముంచేట్టుంది!" అని అన్నాడు బాధగా.

## 10

మర్నాడు అంతా ఎవరిపనిలో వాళ్లు మునిగివున్నారు. అండాళు వచ్చిన చుట్టాలకి యిదివరకు మొదట సుబ్బారావు కిచ్చిన తన పక్కగదే యిచ్చింది. అండాళు తన తోటికోడలు చదువుకున్నదైనా తనతో మాట్లాడేటప్పుడు మాత్రం తొణికేది కాదని గ్రహించింది. తరువాత ఈ పక్కా బస్తీ పిల్ల లక్ష్మి యింట్లో అడుగుపెట్టగానే తన వీపుమీద ఎవరో చరచి చెప్పినట్టయింది. ఈపిల్ల తనలాగే స్థానం, కోడలు స్థానం ఆక్రమించవచ్చని. పాపం!...యింట్లో ఏ అశాంతి అక్రమం లేకుండా జరపాలని అత్తగారితో తనుకూడా నిశ్చయించుకుంది కాని అలా జరిగేటట్టు కన్పించలేదు. ఏమైనా కానీండి ఈ లక్ష్మి యింట్లో భాగస్థురాలుగా వచ్చిందంటే తను విఫలురాలయిపోతుందని దృఢంగా నమ్మింది. రంగారావు మేనమామతో రాత్రిళ్లా మాట్లాడేసరికి అండాళు కొంత అనుమానపడి అడిగింది "మీ మామయ్య మాటకారిగా వున్నారు ఏమైనా కానీండి మీరు మీ మామకూతుర్ని మాత్రం కొస్త కనుకొలకుల్లో వుంచుకుని మాట్లాడండి వారితో" అని గట్టిగా నొక్కి చెప్పింది. మేనరికం మాట జ్ఞాపకానికి రాగానే "రమణకి అలాటి వెర్రివేషాలు కిట్టవసలు...ఇంతకీ వాడు యిష్టపడితే వాళ్ళ ఖర్మం వాళ్ళది మన ఖర్మం మనదీను. నువ్వీయింట్లో పెద్ద కోడలుగా గౌరవింపబడినన్నాళ్లే ఎవరినైనా దగ్గరవుంచుకునేది లేకపోతే ఎవరి అంతట వాళ్లు వెళ్ళమని రూఢిగా చెప్తానే..." అని పెళ్ళాన్ని సమాధాన పర్చాడు.

అండాళు యిన్ని తెలుసుండి కూడా తోటికోడళ్లని దూరంచేసిందన్న మాట రాకూడదని తలచింది. లలిత మేడమీదికి వెళ్లి విశాలని, లక్ష్మిని చూసి వెనక్కి తిరగపోయింది. లక్ష్మి లలిత చేయిపట్టుకుని "ఏమే లలితా! నేను నీకు మామకూతుర్ని తెలుసా!..." అని అడిగింది. లలిత సిగ్గుతో తలవంచుకుంది. రమణ ఏదో చదివున్నవాడిలా లలితని పిలిచి పుస్తకం తెమ్మని చెప్పాడు. లక్ష్మి నవ్వుతూ "మిస్టర్ రమణా!...నువ్వు ఎమ్. ఎస్. సి. చదువుతున్నావని విన్నాను నీముందు ఆలోచనలేమిటి? ఫారెన్ వెడతావా?" అని అడిగింది. "నాకలాటి పెద్దకోరికలు లేవు. ఏదో చదివి ఏ విశాఖపట్నమో గుంటూరో వుద్యోగానికి పిలిస్తే వెళ్ళటమే" అని అన్నాడు. ఈ జవాబుకి చిన్నవదినగారు, లక్ష్మికూడా నవ్వారు. సుబ్బారావు పెళ్ళాన్ని పక్కకి పిలిచి "లక్ష్మితో అంత పూసుకుని తిరగొద్దు" అని అన్నాడు. విశాల యిలాటి మాట తన భర్త నోటివెంట వచ్చేసరికి ఆశ్చర్యపోయింది.

[ఇంకా ఉంది]









# సంతృప్తి

శ్రీనివాస కాశ్యప

పూర్వం ఒక గ్రామంలో
పురుషోత్తం అనుపంతులు
విద్యార్థుల కెందరకో -
వేదం చెబుతుండేవాడు

తర్క వ్యాకరణాదుల
తరచినట్టి ఘనుడాయన
జాలిమిగల ధర్మాత్ముడు
తల వొంచుకు తిరుగువాడు.

అంతటి ఆ పుణ్యాత్ముడు
ఇంటిపోరు పడలేకను
చిన్ననాటి స్నేహితుడొక
డున్న వూరి కేగినాడు.

చిరకాలానికి వచ్చిన
ఈ మిత్రుని గనినంతనె
ఆదరంతో తోషలతో
ఆహ్వానించెను అతడు.

కాని వీడుగాన నైన
భార్య ఏమి అనునోయని
భయము కలిగి అతడపుడు
భార్యనడిగె నొక వరమును!

"మా స్నేహితు డుండువరకు
మాట కెదురు ఆడవద్దు:
నూరుసార్లు నను తిట్టు—
కోరుచుంటి వరమొక్కటి"

అని అడిగిన భర్త కామె
అట్లేయని వరమిచ్చెను:
సంతసించి అత డామెను
సంతతమ్ము తిట్టసాగె.

మిత్రుని అధికారమునకు
విస్తుపోయి పురుషోత్తం
ఆ యిల్లాలిని మనసులో
అభినందించెను ఎంతో.

కొందునాళ్లు ఇలా జరుగ
వందతిట్లు ఐపోయెను:
కందపులుసు చేస్తూ ఆ—
సుందరాంగి లెక్కించెను.

ఆసంగతి మరచి యతడు
"పేసంగే ఓ భడవా!
కరకరమని ఆకలెత్తె
త్వరత్వరగా వడ్డించవె!"

మాటొక్కటి కాగానే
పొగలుగక్కు వేడి పులుసు
కుండను అతని తలపై
పగులగొట్టి ఖరీదడిగె.

ఈ దృశ్యం కనినంతనె
పురుషోత్తం అన్నాడిటు:
"నాశిరమున కుండ లెన్నొ
మా ఆవిడ పగులగొట్టె

కాని ఒక్కసారైనా
ఖరీదేమి అడుగలేదు.
వెయ్యిరెట్లు మీ ఆవిడ
కన్నను నా భార్య మేలు."

అని అతడు మిత్రునికడ
సెలవు తీసుకుని వెంటనె
సంతృప్తితో బయలుదేరి
తన వూరికి చేరినాడు.

తనకన్నను మిన్నగాను
కష్టపడేవారి గాంచి
తారతమ్య మెంచినచో
తప్పకనే కలుగు శాంతి!!

# ★ జితేంద్రియుడు ★

శశిభూషణ్ పాత్రో

భారత యుద్ధం ముగిసింది. ధర్మరాజు హాయిగా రాజ్యాన్ని పాలిస్తున్నాడు. రాజ్యంలో అందరూ క్షేమంగానే వున్నారు. అదేసమయంలో ఓనాడు శ్రీకృష్ణుడు ఓ చెట్టుకింద విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో ఓ వేటగాడి బాణం తగిలింది. ఇంకేముంది! అమాంతంగా ప్రాణాలుపోయాయి. "అన్నయ్యా, శ్రీకృష్ణుడు పరలోకానికి వేంచేశారు;" అని అర్జునుడు ధర్మరాజుతో చెప్పాడు ఈ వార్తవిన్నాక ధర్మరాజు ఏడవలేదు.

ఇంతకూ ధర్మరాజుకి, తత్రాపి, పాండవులకు శ్రీకృష్ణుడు బావవుతాడనే సంగతి మీకు తెలిసే వుంటుంది. అవునా? కాని, ధర్మరాజుమాత్రం విచారించలేదు. మనమైతే ఎంతగా ఏడ్చేవాళ్లమో! బావ చస్తే ఏడుపు రాదూ! గాని, ధర్మరాజు ఏడవలేదు. అందుకే అతన్ని 'జితేంద్రియుడు' అన్నారు పెద్దలు; అంటే ఇంద్రియాల్ని జయించిన వాడన్నమాట. కొన్ని సందర్భాల్లో ఈ 'జితేంద్రియుడు' అనే పదం ఒక్క ధర్మరాజుకే వర్తిస్తుందన్నారు పెద్దలు.

కాస్సేపు బాగా ఆలోచించాక ధర్మరాజు ఇలా అన్నాడు— "మా బావా, తమ్ముడూ, దేవుడైన శ్రీకృష్ణుడే చచ్చిపోయాడుకదా, మరి మనమనగా ఏమాత్రం? మనం కూడా మహాప్రస్థానానికి బయల్దేరాలి." అర్జునుడు వెంటనే సమాధానం చెప్పలేకపోయాడు. అదేవిధంగా భీమ, నకుల సహదేవులుకూడా ఊరుకున్నారు. ఈ విషయంలో వాళ్లు ఏంచెప్పినా ధర్మరాజు ఒప్పుకోడనే సంగతి వాళ్లకు తెలుసు కాబట్టి, పెద్దవాడైన ధర్మరాజుయొక్క నిర్ణయానికే అందరూ ఒప్పుకున్నారు. ఈసంగతి ప్రజలక్కూడా తెలిసింది.

ధర్మరాజు, తన తమ్ముళ్ళతో పాటు, రాజ్యాన్ని వదిలి, హిమాలయారోహణకు బయల్దేరుతున్నాడనే సంగతి విని, ప్రజల్లో కలకలం బయల్దేరింది. రాజ్యంలో అక్కడక్కడా ఏడ్పులు కూడా వినవచ్చాయి. కొన్ని సభలూ, సమావేశాలూకూడ జరిగాయి. ప్రజలు, ధర్మరాజుయొక్క ఉద్దేశాన్ని మార్చుకోమని విన్నపాలు పంపారు; ప్రార్థించారు, ఎన్నోవిధాల ప్రయత్నించారు; కాని లాభం లేకపోయింది. ధర్మరాజు తన నిశ్చయాన్ని మార్చుకోలేకపోయాడు.

పాండవులందరూ కాషాయ వస్త్రాల్ని ధరించారు. ద్రౌపది కూడా వాళ్లతోపాటు బయల్దేరింది. ధర్మరాజు వెంట ఓ కుక్కకూడా బయల్దేరింది. అందరూ సముద్రతీరానికి చేరుకున్నారు. అక్కడ అర్జునుడు తన గాండీవాన్ని సముద్రంలో పారేశాడు.

ఈ మహాప్రస్థాన సందర్భంలో వారెన్నోదేశాల్ని చూశారు. హిమాలయారోహణ మిగిలిపోయింది. కుక్కకూడా వాళ్ళ వెంటవెంటనే వుంది. దుర్గమమైనదారి. అంతటా మంచు. చల్లగాలి శరీరాన్ని ఒణికించేస్తోంది. ఊపిరి పీల్చటంకూడా దుర్భరంగా వుంది. అసలే హిమాలయపర్వతం. అది హిమానికి ఆలయం.

ఈనాడు వైజ్ఞానిక ఉపకరణాలతో హిమాలయారోహణ చేసినప్పటికీ తాతలు దిగివస్తున్నారు. అలాంటిది మన పాండవులకేముంది—మామూలు వస్త్రాలు తప్ప! చలికి తాళుకోలేక, మంచులో నడవలేక, ఆ మంచులో ద్రౌపది కూరుకుపోయింది. బయటికి రాలేకపోయింది. అంటే అక్కడే ద్రౌపది చచ్చిపోయిందన్నమాట. ధర్మరాజు ఆగలేదు. తక్కిన సోదరులూరుకుంటారా?

మహా పతివ్రతయిన ద్రౌపది ఈవిధంగా చనిపోయిందంటే వాళ్లకాశ్చర్యం కలిగింది. దీనిక్కారణం తెలుసుకోవాలి. ఎలా? ఎవరడుగుతారు? నువ్వంటే నువ్వనుకున్నారు. ఆఖరికి భీముడే చొరవచేసి అడిగాడు. వెంటనే ధర్మరాజు అన్నాడు కదా — "ధనంజయుని పట్ల ద్రౌపదికి ప్రత్యేకాభిమానం

# ★ జితేంద్రియుడు ★

వుండేది. ఆ భేదబుద్ధియొక్క ఫలితమే ఇది."

వెనక్కి తిరిగిచూడకుండా ధర్మరాజు ప్రయాణం సాగిస్తూనే వున్నాడు; హిమాలయ దుర్గమపథం ఓ లెక్కలోంది కాదన్నట్టుగా అయితే, ఈసారి సహదేవుడు నడవలేక వెనకబడ్డాడు. అలిసిపోయాడు. కాళ్లు బరువుగా పడుతున్న కారణంచేత, అతనుకూడా మంచులో కూరుకుపోయాడు. ఆ బ్రహ్మాండమైన మంచులో సహదేవుడు దేహయాత్రను చాలించాడు. మళ్లీ భీముడు కారణమడిగాడు—

"తనకన్నా బుద్ధిమంతుడు, ప్రాజ్ఞుడు, అఖండ మేధాశక్తి గలవాడు ఈ భువిలో లేడని, అహంభావంతో వుండేవాడు. ఇదే అతని పతనానికి కారణం," అన్నాడు ధర్మరాజు. ప్రయాణం సాగుతోంది. పెద్దవాడిని ఎదిరించలేక, తక్కిన సోదరులుకూడా అనుసరించారు. కుక్కకూడా ఎక్కడా ఆగలేదు.

ద్రౌపదీ సహదేవుల వియోగాన్ని నకులుడు సహించలేకపోయాడు. వాళ్ళ విషయమై ఆలోచిస్తూ విచారిస్తూ మెల్లిగా నడుస్తో, కాస్త వెనకబడ్డాడు. అప్పటికి చలియొక్క ప్రభావమూ, మంచుయొక్క ప్రభావమూ కాస్త హెచ్చు స్థాయిలో నున్నందువల్ల, నకులుడు కూడా వాటికి తాళుకోలేక చచ్చి ఊరుకున్నాడు. మళ్ళీ భీముడు అడిగాడు - "తనకన్నా అందగాడు ఈ భువిలో నభూతో నభవిష్యతి అన్నట్టుగా గర్వించాడు. అతని గర్వమే అతన్ని మన నుండి వేరు చేసింది;" అన్నాడు ధర్మరాజు.

ఈ ముగ్గురూ పోయినా ధర్మరాజు చలించలేదు. అందుకే అతన్ని జితేంద్రియుడన్నారేమో! కాని అర్జునుడు మాత్రం సహించలేకపోయినాడు. హిమాలయపర్వతాల మీదకు వెడుతున్నకొద్దీ చలి ఎక్కువ కాసాగింది. అదే కారణంచేత అర్జునుడు కూడా ప్రాణాలు విడిచేశాడు. భీముని మనస్సులో నున్న విచారం ఇంతా అంతా కాదు. కాదు మరి! ఒక్కొక్కరే ఆవిధంగా చస్తోంటే, మీరూ నేను సహించగలమా? భీముడు కూడా సహించలేక అడగనే అడిగాడు — వెంటనే ధర్మరాజు ఇలా జవాబిచ్చాడు - "మిథ్యాభిమానంచేత ఒకే రోజున శత్రువుల నందరినీ హతమార్చేస్తానని అర్జునుడన్నాడు. గాని, అలా చెయ్యలేకపోయాడు. ఆమిథ్యోక్తి వల్లనే అతను చనిపోయాడు."

కుక్కతోపాటు ధర్మరాజు మళ్ళీ పయనం సాగించాడు. ఎంత ప్రయత్నించినప్పటికీ సోదరుల వియోగాన్ని భీముడు సహించలేకపోయాడు. ఆఖరికి అతను కూడా ప్రాణాలు వదుల్తూ వదుల్తూ ఆఖరు సారి ప్రశ్నించాడు - "అన్నయ్యా, నేను మీ ముద్దు తమ్ముణ్ణి. నేనేం పాపం చేశా - నని మీనుండి దూరమవుతున్నానో చెబుతారా? —

"నువ్వు అతిగా భోంచేశావు. మరెవర్నీ ఖాతరు చెయ్యకుండా నీబలాన్ని నువ్వే పొగుడుకున్నావు. ఇదే కారణం," అన్నాడు ధర్మరాజు. ఇద్దరే మిగిలిపోయారు.

ధర్మరాజు - అతని వెంటకుక్క. చలిగాలి ఘోరంగా వుంది. ధర్మరాజు పయనం సాగుతునే వుంది. ధర్మరాజు దృఢనిశ్చయం ఇంద్రాసనాన్ని కదిలించేసింది. ఇంద్రుడు ప్రత్యక్షమై తన రథాన్ని సమర్పిస్తూ స్వర్గానికి రమ్మన్నాడు.

ఎబ్బే! ఆమాత్రంతో ఆమహాపురుషుడు లొంగిపోతాడా! అన్నాడుకదా — "దేవేంద్రా, నా తమ్ములందరూ కూడా నాతోపాటు రావాలి. వాళ్ళను వదిలి నేను స్వర్గానికి రాదల్చుకోలేదు. ద్రౌపదిని కూడా వదలటానికి వీల్లేదు."

"ఆర్యా, మీ నలుగురు తమ్ములు, ద్రౌపదితోపాటు అప్పుడే అక్కడికి చేరుకున్నారు. గాబట్టి, సందేహించకుండా మీరు ఈ శరీరంతో నాతో ఈ రథం మీద స్వర్గానికి రావాలి;" అన్నాడు దేవేంద్రుడు.

"మరి, ఈ కుక్క నాతోపాటు ఇంతవరకు పయనం సాగిస్తూ వచ్చింది. దీని స్వామిభక్తి కొనియాడదగింది. ఇదికూడా నాతో స్వర్గానికి రావాలి. ఏవైభవంకోసమైతే నాభక్తుణ్ణి త్యజించే అవసరం వస్తుందో ఆవైభవం నాకు అవసరం లేదు;" అన్నాడు ధర్మరాజు. అనటం తడవుగా కుక్క సాక్షాత్తు యముడుగా మారిపోయింది. యమధర్మరాజుయొక్క వరంవల్ల ధర్మరాజు పుట్టాడని మీకు తెలిసే వుంటుంది. తన కొడుకు ఇంత

గొప్పవాడైనందుకు యముడు చాలా సంతోషించాడు.

దేవగణమంతా అక్కడ ప్రత్యక్షమై ధర్మరాజుని శరీరంతోనే స్వర్గానికి తీసుకుపోయారు. స్వర్గం చేరుకోగానే దేవతలతో ధర్మరాజు ఇలా అన్నాడు - "మహానుభావులారా! నా తమ్ముళ్లు, ద్రౌపది ఇక్కడ కనబడలేదే. వాళ్లు ఏలోకములోనున్నారో, అది మంచిదికానీ, చెడ్డదేకానీ, నన్నుకూడా అక్కడికే తీసుకువెళ్లండి." ధర్మరాజు ఎంతపుణ్యార్జన చేశాడో, అంతగా మిగతావాళ్లు చెయ్యలేదనీ, వాళ్లు ఆ స్థానానికిఅర్హులుకారనీ ఇంద్రుడు మనవిచేసుకున్నాడు. అప్పటికీ ధర్మరాజు ఒప్పుకోలేదు. ఇంద్రుడు అతనినిశ్చయాన్ని మార్చలేక పోయాడు.

అతని సోదరుల్ని చూపించమని ఒక దూతను పంపించాడు. దూతవెంట ధర్మరాజు బయల్దేరాడు. అయితే ఆ దారి చాలా భయంకరంగా వుంది. దారంతా రక్తమాంసాలు, క్రిమికీటకాదుల్తో నిండివుంది. ఇంకా... ఇంకా...... దాన్ని ధర్మరాజు వర్ణించాల్సిందే గాని, మనకు చాతకాదు. మనం చూడలేదు కాబట్టి. మనం కేవలం చదివాం. విన్నాం, అంతే.

చాలా దూరం నడిచాక ధర్మరాజు దూతతో అన్నాడు- "ఇంకా మన మెంతదూరం వెళ్లాలి?" "ప్రభో! మీరెప్పుడైతే అలిసిపోతారో అప్పుడే మిమ్మల్ని స్వర్గానికి తీసుకురమ్మని దేవేంద్రుని యాజ్ఞ;" అన్నాడు దూత. అక్కడున్న దుర్గంధ పూరితమైన వాతావరణంలో ధర్మరాజుకి తల దిమ్మెక్కినట్లనిపించింది. వెనక్కి తిరిగాడు.

అప్పుడే చీకట్లో ఓ గొంతు వినిపించింది - "ధర్మరాజా! దయచేసి కాస్సేపు ఆగండి. మీరాకవల్ల ఇక్కడ పవిత్రమయిన వాయువు దొరికింది." "ఎవరుమీరు?" గట్టిగా కేకవేశాడు ధర్మజుడు. "మేం నీ తమ్ముళ్లం. ద్రౌపది కూడా మాతోనేవుంది," అంటూ జవాబు వచ్చింది. చూశారా, పాఠకులూ! మీకు జ్ఞాపకముందా - ధర్మరాజు యుద్ధభూమిలో ఓచిన్న అబద్ధం చెప్పాడు. అంటే, తన జీవితంలో ఒకే ఒక అబద్ధంచెప్పాడు- 'అశ్వత్థామ చచ్చిపోయాడు (ఏనుగు)' అన్నాడు ధర్మరాజు. ఆ ఒక్క అబద్ధంకోసం ఆకాస్త నరకాన్ని అనుభవించాడు. కాబట్టి ఎప్పుడూ అబద్ధాలు చెప్పకండేం! అది చాలా పాపం!

అయితే ఆ జవాబు వినగానే ధర్మరాజు చాలా విచారించాడు. "నా వాళ్లు ఇక్కడే వున్నారు గాబట్టి, నేనూ ఇక్కడే వుంటాను." అన్నాడు ధర్మరాజు. వెంటనే అక్కడి చీకటి పటాపంచలైంది. ఆ ప్రదేశమంతా స్వర్గంగామారింది. అందరూ కలుసుకొన్నారు. కథ కంచికి మనం ఇంటికి



# ★ వాసు చదువు ★

(గత సంచిక తరువాయి)

## 13

స్కూల్లో వార్షికోత్సవపు ముగింపుసభ జరిగింది. ప్రార్థన పాడేందుకు వాసునే నియమించారు. అణుకూ, బెణుకూ లేకుండా అంత మందిలో ఒక జాతీయగీతం పాడాడు వాసు. తరువాత వుపన్యాసాలు జరిగినయ్. పిదప బహుమతులు పంచిపెట్టారు.

నాటకంలో వుత్తమంగా నటించినందుకు ఓ వెండిపతకం, వ్యాసరచనలో మొదటి బహుమతిగా పుస్తకం, క్లాసులో కనుపరుస్తున్న తెలివితేటలకి, మరో పుస్తకం వాసుకి లభించాయి. తెలుగులో మాంచి కృషిచేసినందుకు పద్యకావ్య మొకటి చిన్నది తెలుగు పండితులు బహూకరించారు వాసుకి. అందరి సముఖంలో అన్ని బహుమతులు పొందినందుకు అమితానందం పొందాడు వాసు. అవన్నీ ప్రక్కనే వున్న రాజు, సీతారాం, ధర్మారావులు చెరొకటీ పట్టుకున్నారు. తమ స్నేహితుడి ప్రతిభకు అనుగ్గుణా యెంతో ఆనందించారు. వాళ్లకి వాసు బహుమతులు పొందాడన్న అసూయ లేదు. తాము పొందలేదన్న కాంక్ష, విచారాలు లేవు వారికి.

నలుగురూ నడుస్తున్నారు. విద్యుద్దీపాలకాంతిలో వాళ్లముఖాలు ప్రకాశవంతంగా అగుపిస్తున్నయ్.

"మన సెక్షను పేరుంచావోయ్" అన్నాడు రాజు.

"మాష్టరు నిన్నెంతగా మెచ్చుకుంటాడనుకొన్నావ్" అన్నాడు సీతారాం. ధర్మారావు బయటికేం అనకండా తనలో తనే స్నేహితుని గురించి గర్వపడుతూ ఆనందిస్తున్నాడు.

ఇంత జరుగుతున్నా కామేశంగాని, విశ్వంగాని, వాసుదగ్గరికి రావటమే లేదు. కామేశం రాడన్న సంగతి తెలుసు వాసుకి. కాని విశ్వం యెందుకు తనతో కలియ

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

ముద్దంశెట్టి హనుమంతరావు

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

లేదో అర్థం కాలేదు వాసుకి. పుస్తకాలు చేత్తోపట్టుకుని యిల్లుచేరుకున్నాడు వాసు. మొదట వాటిని మేనత్తలకీ, సీతాలక్ష్మికి చూపించాడు. మేనత్తలు ఆనందించారు. సీతాలక్ష్మి వికపుకవ్వు నవ్వేసి వూరుకుంది. అప్పుడే కామేశం వచ్చాడు. చూపించకపోతే బావుంటుందా? అతనికూ్కడా పుస్తకాలు వెండిపతకం చూపించాడు.

"నాకు తెలుసు లేవోయ్—నేనూ అక్కడే వున్నానుగా; చూపించటం యెందుకూ?" అన్నాడు ద్వేషభావంతో. వాసు చిన్నబోయాడు.

"ఏడికావులే వెధవా! సిగ్గులేకపోతే సరి...అతడికాళ్లు కడిగినా నీకు బుద్ధి రాదు" ఆ కోపంలో వాసుకి ఆధిక్యత యివ్వకుండా వుండలేకపోయింది.

"బావుందమ్మా, నువ్వన్న మాట—అందరూ ఒక్కలాగే వుంటారనుకున్నావా?" అన్నాడు కాస్త కోపం కనబరుస్తూ కామేశం.

"నీమొహానికి యెదురుజవాబులు కూడాను" అంది సీతాలక్ష్మి కోపంగా.

"చాల్లే అమ్మా! నీతో యెప్పుడూ యీ తగాదా వున్నదేగా" అంటూ లోపలికి పోయాడు కామేశం.

మరుచటిరోజు వుదయం తన కందిన బహుమతులు తీసుకుపోయి కృష్ణారావు మాష్టరుకి చూపించాడు వాసు అతని సంతోషం యెలా తెలియబర్చాలో అర్థం కాలేదు.

"వాసూ, నిన్నెలా పొగడాలో అర్థం కాలేదు. నువ్వెప్పుడూ యీ శ్రద్ధతోనే చదువు; బహుమతులు పొందుతూండు. ఇన్నాళ్లకి నాకానందం కలిగించే విద్యార్థి బంధువుని చూడగలిగాను. మాకుటుంబంలో ఒక్కరూ లేరులే. అంతా పోకలు చలాయించేవారేగాని, చదువులున్నా; ముందు ముందు యిలాగే అందరి అభిమానం సంపాదిస్తావని నమ్ముతాను" అన్నాడు నవ్వుతూ వుపదేశిస్తున్నట్టుగా. వాసు యేం జవాబు చెప్తాడు? ఆనందపార

నిశ్చయంతో ఒక్కసారి పెదాలపై నవ్వును దొర్లించాడు.

## 14

సూర్యనారాయణ దినదినానికీ వృద్ధుడై పోతున్నాడు. ఏ పనిలోనూ భాగం పుచ్చుకోలేకపోతున్నాడు. కాలం గడుస్తున్నది, వాసు స్కూలుఫైనల్ కి వచ్చాడు. కామేశం ఓసారి స్కూలుఫైనల్ తప్పిపోవటంవల్ల మళ్లీ అదే క్లాసు చదువుతున్నాడు. వాసు తనతో కలిసిపోవటం కామేశంకి ద్వేష భావం పుట్టించింది. కాని యేం చేస్తాడు? అదెవరి తప్పు?

వాసు స్కూలుఫైనల్ చదువుతున్నప్పుడెన్నో ఆటంకాలు కలిగినయ్. సీతాలక్ష్మి వాసు చదువుకి అంతరాయం కల్గించాలని యెప్పుడూ యేదో ఒకపని పురమాయిస్తుండేది. చిన్నపిల్లలకి చదువు చెప్పమనేది. ఇవన్నీ వాసుకి కొంతవరకు కష్టమనిపించినా సహనంతో భరించాడు. తండ్రి వృద్ధాప్యంవల్ల వున్న కాస్త వ్యవసాయమైనా సరిగ్గా జరిగేది కాదు. అదో ఆలోచన వాసుని బాధ పెడుతూండేది. ఓ ప్రక్క కామేశం యెప్పుడూ కలహాలకే చూస్తుండేవాడు. కాని వాసు మూగవానిలా వూరుకుండేవాడు. ఇంక మరెన్నాళ్లు? ఓ సంవత్సరం పాటు భరించా లనుకున్నాడు.

ఎన్నో, పుస్తకాలు, నోట్సులు, కావల్సివచ్చేవి. అవన్నీ కొనుక్కుందుకు వాసు సాగలేక పోయేవాడు డబ్బులేక. సూర్యనారాయణ కొడుక్కి ఆర్థికంగా సహాయం చేయలేకపోతున్నందుకు విచారించేవాడు. కామేశం కొన్న నోట్సులు వుపయోగించేందుకు వాసుకి అభిమానం అడ్డువచ్చింది. అంచేత రాజు, సీతారాందగ్గర అప్పుడప్పుడు నోట్సులు తెచ్చుకుని రాసుకుంటుండేవాడు.

పరీక్షలు దగ్గరపడుతున్నయ్. ఇంతకుముందుకంటె శ్రద్ధగా చదువుతున్నాడు వాసు. కొన్ని వాసుకి తెలీని విషయాలు కృష్ణారావుగారికి కూడా అందుబాటులో వుండేవి కావు. అవి క్లాసుమాష్టర్నడిగి తెలుసుకునేవాడు వాసు.

పరీక్షలు జరిగిపోయాయ్. తృప్తిగానే రాశానన్నాడు వాసు కృష్ణారావుగారితో. సరియైన నిద్రలేకపోవటం వల్ల వాసు ఆరోగ్యం చెడి నీరసించిపోయాడు. వెనుకముందు చూడకుండా స్వగ్రామం పోయాడు. కొద్దిరోజులు పల్లె గాలి తగలటంతో మళ్లీ తేరుకున్నాడు.

పరీక్షా ఫలితాలు తెలిసినరోజు



"ఇక్కడున్నావా, దొంగా!"  ఫొటో : ఈమని సత్యనారాయణరెడ్డి, రాజమండ్రి.

## వాసు చదువు ★

ధర్మారావుతో కలిసి పట్నం వచ్చాడు వాసు. వాసు పాసయ్యాడు. రాజు, సీతారాం, కామేశం పాసయ్యారు. తన కొడుకు పాసయినందుకు సూర్యనారాయణదంపతులెంతో ఆనందించారు. రత్నాలు, వరహాలు, వుప్పొంగిపోయారు. కృష్ణారావుగారు మొదటే వూహించుకున్నారు పాసవుతాడని. పోతే సీతాలక్ష్మి వాసు పాసయినందుకు విచారించింది.

స్కూలుఫైనల్ కి మించి అక్కడ చదువులేనందువల్ల, తండ్రి వృద్ధాప్యంలో వున్నందువల్ల పై చదువులకి పోలేక చదువుకి స్వస్తిచెప్పాడు వాసు. చాలమందిమాష్టర్లు వాసుని పై చదువుకి పంపిస్తే బావుంటుందని కృష్ణారావు మాష్టరుతో చెప్పారు. కాని అతనుమాత్రం యేవిఁటిచేస్తాడు? వాసుకి ఆర్థిక స్తోమత లేదని తెలుసు—

వాసు పట్నంలో పూర్తిగా మకాం యెత్తేసి పల్లెచేరుకున్నాడు. కాని యింత చదువుకున్న తరువాత పల్లెలో వుండిపోతాడా? సూర్యనారాయణ ఆశయం కొడుకు వుద్యోగం చెయ్యాలని కదూ!

వాసు కిప్పుడు వుద్యోగాన్వేషణ పెద్దసమస్యయింది. ఎన్నో దరఖాస్తులు పెట్టాడు. జవాబుల్లేవు. పట్నములో కనిపించిన ఆఫీసు గడప తొక్కాడు. ప్రతిచోట ఖాళీలులేవన్న మాటే! ఎంతని తిరుగుతాడు? విసిగి వూరుకున్నాడు. సూర్యనారాయణ ఆశయం సిద్ధించలేదు. మళ్లీ మనసు మార్చుకున్నాడు— కొడుకు తనకెందుకు దూరంగా వుండాలి? అని. సంవత్సరంవరకు అలానే వాసు నిరుద్యోగిగా కాలం గడిపాడు. ఈ సంవత్సరంలో ధర్మారావు

# విధిలిఖితం

'వీ'కు ఒకసలక్షణమైన పిల్లను భార్యగా చేసుకోవాలని కోరిక కలిగింది. కాని ఇంతవరకు అతని కోరిక నెరవేరలేదు. కారణం- అతనికి నచ్చిన పిల్ల దొరకలా. ఒకప్పుడతడు 'సింగ్ పో'కు ప్రయాణమయి వెళుతూ, సంగ్ చంగ్ పురదక్షిణద్వారానికి అవతలున్న సత్రంలో ఆగాడు. సాంఘికంగా అతనితో సమానమయినటువంటి పాన్ కుటుంబంలో ఒకమ్మాయి ఉందనీ, ఆ సంబంధాన్ని గూర్చి మాట్లాడటానికి తన్ను లంగ్ పింగ్ దేవాలయంలో ఉదయం పూట కలుసుకోవలసిందని 'వీ'తో ఓ పెళ్ళిళ్ళ పేరయ్య చెప్పాడు. భాగ్యవంతురాలు, అందమైన యువతి తనకు భార్య కాబోతోందనే సంతోషంలో అతనికి ఆ రాత్రి

మొ. యు. చౌ.

నిద్రపట్టక వేకువనే లేచాడు. లేచి స్నానాదికాలు పూర్తి చేసుకుని చక్కగా అలంకరించుకుని నిర్ణీత సమయానికి బయలుదేరాడు. ఇంకా సరిగా తెల్లవారలేదు. నీలాకాశంలో చంద్రుడు ప్రకాశిస్తూనే వున్నాడు. 'వీ' అక్కడికి చేరేటప్పటికి, చంద్రకాంతిలో ఏదో పుస్తకం చదువుతూ దేవాలయం మెట్లపై కూర్చున్న ఒక వృద్ధుని చూచాడు. అతని ప్రక్కనే నేల మీద ఓ చిన్న సంచి వుంది.

ఈ సమయం కాని సమయంలో ఆ వృద్ధుడు ఏం చదువుతున్నాడో తెలుసుకోవాలని కోరిక కల్గింది 'వీ'కు. ఆ వృద్ధుడి భుజాలమీద నుంచి తొంగిచూచాడు. కాని అదేమిటో అతనికి అర్థమవలేదు. పురాతనమైనటువంటి, ప్రాచీనమైనటువంటివి అన్ని భాషలూ— ఆఖరుకు సంస్కృతం కూడా అభ్యసించాడు 'వీ'. మరి ఈ వ్రాత ఏమిటో అతని కేమాత్రం బోధపడలేదు.

"నువ్వు చదివే పుస్తకం ఏమిటో అడగవచ్చునా తాతా? నాకు ఈ ప్రపంచంలో వున్న భాషలు, లిపులన్నీ తెలుసుననుకుంటున్నాను. మరినువ్వు చదివే లిపిలాంటిది నేనెవ్వడూ చూడలేదు."

"అవును, నువు చూచివుండవు. నీకు తెలిసే ఏభాషలోను ఇది వ్రాయబడలేదు." అని చిరునవ్వు నవ్వుతో ఆ వృద్ధుడు సమాధానమిచ్చాడు.

"అయితే మరేమిటి?"

"నువ్వు మానవమాత్రుడివి. నీకేం తెలుసు నాయనా? ఇది దేవలోకపు గ్రంథం."

"అయితే నువ్వు దేవతవన్న మాట! ఏం చేస్తున్నావిక్కడ?"

"ఏం, ఎందుకుండకూడదిక్కడ నేను? నువ్వు చాలా పెందరాళే వచ్చావు. రాత్రికి ప్రాతఃకాలానికి

---

స్కూలుఫైనల్ చదువుతూ ప్యాసయ్యాడు. అతడికీ అదే సమస్య.

అయితేనేం ధర్మారావుకి ఆర్థిక స్తోమత వుంది. పై చదువు చదవాలని వున్నా వాసుని విడిచి పోలేకపోయాడు. ఏమిటో ఆ అనుబంధం వాళ్ళిద్దరికీ! ఉద్యోగాన్వేషణలో కాలాన్ని వ్యర్థంచేయటం ధర్మారావు కిష్టంలేకపోయింది. తండ్రి సలహాపై ఓ ఫేన్సీస్టోర్సు ఆ పల్లెలో పెట్టాడు తన స్వంతమదుపుతో. అందులో వాసుని తనకి అదనుగా తీసుకుని నెలకి యాభైరూపాయలిస్తుండేవాడు. పట్నంనుండి క్రొత్త వస్తువులు తెచ్చి అమ్ముతుండేవాళ్లు. రాను రాను ఆ కొట్టు పెద్దస్టోరుగా మారింది. ఇప్పుడు వాసుకూడా అందులో కొంతభాగస్థుడే... అటు తండ్రి వ్యవసాయం, యిటు వ్యాపారం చూసుకుంటూ కాలం గడుపుతున్నాడు.

అప్పుడప్పుడా యిరువురు స్నేహితులు ఆలోచిస్తుంటారు తాము చదివి సాధించిందేమిటీ అని. దానికి జవాబు యేం రాదు...ఒక్కటే పరోక్షంగా అగుపిస్తున్న జవాబు-ప్రపంచజ్ఞానం సంపాదించారని. అంతే!

(అయిపోయింది)

మధ్యకాలంలో నువు చూస్తుండగా సంచరించే బాటసారుల్లో సగంమంది మానవులూ సగం దేవతలూను. అయినా నువ్వు ఎవరు ఎవరో తెలుసుకోలేవు. నేను మానవకార్యాలకు సంబంధించిన విషయాలు చూడవలసిన వ్యక్తిని. నాకు సంబంధించిన మనుషుల్ని వారి చిరునామాలను పరీక్షిస్తూ రాత్రల్లా సంచారం చేస్తుండాలి."

"ఏం విషయాలు?" అని అడిగాడు 'వీ'.

"వివాహ విషయాలు."

ఈమాట వినగానే 'వీ'కు అమితమైన సరదా కలిగింది.

"అయితే నువ్వే నన్నమాట - క్షమించండి, నేను సంప్రదించదలచుకొన్న వ్యక్తి మీరే. అయిన కుటుంబంలో అమ్మాయిని వివాహం చేసుకుందాం అనుకొన్న నా కోరిక ఇంతవరకు నెరవేరలేదు. యథార్థానికి నేనిక్కడికిపుడు అందం, సంస్కారం అన్నిటికంటె మించినగుణం కల పాన్ కుటుంబీకుల అమ్మాయిని వివాహం చేసుకునే విషయమై వచ్చాను. చెప్పండి, నాకు జయం కల్గుతుందా." అని అడిగాడు.

"నీ పేరు, చిరునామా ఏమిటి?" అని వృద్ధుడడిగాడు.

'వీ' చెప్పాడు. తన చేతిలోని గ్రంథం పేజీలు అటూ ఇటూ తిరగవేసిం తర్వాత తలపైకెత్తి వృద్ధుడిలా అన్నాడు:

"లేదనే నా భయం నాయనా! చూడు, ఈ వివాహాలన్నీ దేవలోకంలోనే నిర్ణయం చేయబడతాయి. అవన్నీ ఈ పుస్తకంలో వ్రాయబడినవి. నీ కాబోయే భార్యనుగురించి చూచాను. ఆమెకిపుడు మూడేళ్లు వయస్సు. ఆమెకు పదిహేడో సంవత్సరం రాగానే వివాహం చేసుకుంటావు. ఇది దైవనిర్ణయం. విచారించకు."

"ఏమిటి, విచారించొద్దూ! ఇంకా పధ్నాలుగేళ్లు నేను బ్రహ్మచారిగానే వుండాలనా మీ వుద్దేశం?"

"పరిస్థితి అటువంటిది"

"అయితే నేను పాన్ కుటుంబంలోని అమ్మాయిని వివాహం చేసుకోవటం సంభవించదన్నమాట?"

"అవును"

'వీ'కు ఈ వృద్ధుడి వాక్యాలు నమ్మాలో లేదోకూడా తెలవటంలా. అయినా "ఆ సంచిలో ఏమున్నాయి?" అనిఅడిగాడు.

"పట్టుదారాలు, ఎర్రవి." అంటూ ఆ వృద్ధుడు చిరునవ్వు నవ్వాడు. "చూస్తున్నావుగా, ఇది నా ఉద్యోగం. ఈ పుస్తకంలో లిఖించబడిన అనేక జంటల్ని పరిశీలిస్తాను. భార్యాభర్తలుగా ఉద్దేశింపబడిన చిన్నది, చిన్నవాడు జన్మించగానే వారిపాదాలు, రాత్రిపూట వెళ్ళి, దగ్గరకు చేర్చి ముడివేస్తాను. ఒకసారి ముడివేశాను అంటే చాలా జాగ్రత్తగా వేస్తాను. అంతే ఇక యీ ప్రపంచంలో వారినెవరూ విడదీయలేరు. వారిలో - ఒకరు పేదవారై పుట్టవచ్చును, ఒకరు శ్రీమంతులై పుట్టవచ్చును, లేదా వేలకొలది మైళ్ళ దూరంలో జన్మించి వుండవచ్చు. ఆసంబంధించిన రెండు కుటుంబాలకు పరస్పరం బద్ధవైరం ఉండొచ్చు — కానీ చివరకు వారు భార్యభర్తలై తీరవలసిందే. దానికి వారు చేయగల్గిందేమీ లేదు."

"అయితే, నాకు కూడా ముడి వేశారనుకుంటాను."

"అవును, వేశాను."

"మరి నాకు భార్యగా లిఖించబడిన ఆ మూడేళ్ళ బాలిక ఎక్కడుంది?"

"ఆ, అమ్మాయి మార్కెట్ లో కూరగాయలమ్మే స్త్రీ వద్ద పెరుగుతోంది. వాళ్లు ఇక్కడికి ఎంతో దూరంలో లేరు. ఆ స్త్రీ రోజూ వుదయం మార్కెట్టుకు వస్తుంది. నీకు కుతూహలంగా వుంటే నాతో రా. ఆ అమ్మాయిని చూపెడ్తాను."

అప్పుడే అరుణోదయమవుతోంది. కాని 'వీ'తో సమావేశమవుతానన్న పెళ్ళిళ్ళ పేరయ్య ఇంతవరకు రాలేదు. "చూడు నాయనా. అతనికోసం చూచి లాభం లేదు" అన్నాడు వృద్ధుడు.

అట్లానే వారిద్దరు కొద్దిసేపు సంభాషించుకొన్నారు. 'వీ'కు ఆ వృద్ధుడితో మాట్లాడటం చాలా ఆహ్లాదకరంగా వుంది. వృద్ధుడు చెప్పాడు. తన వుద్యోగం అంటే అతనికి బ్రహ్మాండమైన ప్రేమట. "ఈపట్టుదారం ముక్క ఎంత పని చేస్తుందో చాలా విచిత్రంగా వుంటుంది. వాళ్లవాళ్ళ గృహాల్లో అమ్మాయి అబ్బాయి పెరుగుతారు. ఒకళ్లున్నట్టు ఒకళ్లకు తెలవనే తెలవదు. కాని సమయం రాగానే కలుసుకుంటారు. అంతే, తలక్రిందులుగా ప్రేమలో పడి మునకలేస్తారు.

అపుడు వాళ్లు తెలుసుకొనేదల్లా దానికి వాళ్లేం చెయ్యలేరని. ఇంతలో మళ్లీ వాళ్ళకు, ఎవరన్నా ఓ అమ్మాయిగాని అబ్బాయిగాని, మధ్యలో అడ్డుతగిల్తే ఆ ముడిలోంచి ఒక గంతేస్తారు. పెద్ద చిక్కులో ఇరుక్కుని ఆఖరుకు ఆత్మహత్యకు పాల్పడతారు. ఇల్లాంటివి తరచు జరుగుతూండటం చూస్తూనే వున్నాను" అన్నాడు వృద్ధుడు.

కొద్దిదూరంలోనే వున్న మార్కెట్లోకి అపుడే జనం నిండుకుంటున్నారు.

"రా, నాతోరా" అని ఆ వృద్ధుడు తలతో సైగచేసి సంచి పుచ్చుకుని లేచాడు. మార్కెట్లోకి రాగానే, కూరగాయల ముమ్మతో చంకను ఒక పిల్లనేసుకుని చింపిరిజుట్టుతో దుకాణంలో కూచున్నవయస్సు మళ్లిన ఓస్త్రీని చూపెట్టాడు వీకి వృద్ధుడు. ఆస్త్రీ కళ్లు పొరలు క్రమ్మి వున్నాయి. సరిగ్గా చూపు కనబడటంలేదు.

"అదుగో అక్కడుంది, ఆపిల్లే నీకాబోయే భార్య." వీ ఏదో గొణిగాడు. "ఏమిటి మీవుద్దేశం? నాతో పరిహాసాలాడుతున్నారా?" వృద్ధునివేపు తిరుగుతూ ఆగ్రహంగా అన్నాడు వీ.

"లేదు. నీకు నేను నామాట హామీ ఇస్తున్నాను. ఆపిల్ల అదృష్టజాతకురాలు. శుభసమయంలో జన్మించింది. నిన్ను తప్పక పెళ్లాడుతుంది. సుఖజీవనం చేస్తారు. తర్వాత జనించిన కుమారుడు కారణంగా ఆమె సమాజంలో ఉన్నత స్థాయిని అందుకుంటుంది."

బక్క చిక్కిన నిర్భాగ్యురాలు, అనాథబాలికవంక చూడగానే 'వీ' ధైర్యం అపహృతమైంది. ఆ వృద్ధుని మాటల్ని ఖండించి వాదన చేద్దామనుకున్నాడు వీ. కాని అతను తిరిగి చూచేటప్పటికి ఆ వృద్ధుడు అంతర్ధానమయ్యాడు.

'వీ'నిరాశాపూరితహృదయుడై ఒంటరిగా ఇంటికి చేరుకున్నాడు. తనను కలుస్తానన్నమనిషి రాలేదు. వృద్ధుడిమాటలు ఒకవేపున బాధిస్తున్నాయి. అనుకున్నాడతను "నాకేమిటి, విద్యాధికుణ్ని. మంచి కుటుంబంలో అమ్మాయిని వివాహం చేసుకొంటాను" అతనికి ఆ అనాథ బాలికను వివాహం చేసుకునే తలంపు అసహ్యంగానూ, అతిపరిహాసాస్పదంగాను కనబడింది. దీన్ని గురించి అతడు ఆ రాత్రి నిద్రపట్టనంత ఇదిగా కలవరం చెందాడు.

మర్నాడుదయం అతడు సేవకుడితో మార్కెటుకు వెళ్లాడు. బాకుతోగనక ఆబాలికను చంపితే పెద్ద బహుమానం ఇస్తానని వాగ్దానం చేశాడు నౌకరుకు. దుకాణంలో బాలికను పట్టుకుని కూచున్న స్త్రీని చూచారు వాళ్లిద్దరు. తగిన సమయం ఆసన్నమవగానే నౌకరు తటాలున బాకులాగి ఆ పిల్లను పొడిచి పారిపోయాడు. పిల్ల రోదించింది. స్త్రీ "హత్య, హత్య" అని అరిచింది. మార్కెటంతా గందరగోళంగా వుంది. జనం ప్రోగయ్యారు. ఈ హడావుడిలో 'వీ' అతని నౌకరూ పలాయనం చిత్తగించారు.

"చంపేశావా?" అనడిగాడు వీ.

"లేదండి, గుడిచూసి కొట్టేసమయానికి ఆపిల్ల అనుకోకుండా ప్రక్కకు తిరిగింది. ముఖమ్మీద కణతల్దగ్గరగా చీరుకుపోయుంటదనుకుంటాను" అన్నాడు నౌకరు.

వీ వెంటనే పట్టణంవదలి వెళ్లిపోయాడు. అంతటితో ఆ సంఘటన సమసిపోయింది.

వీ ఇపుడు రాజధానికి పశ్చిమంగా ఉంటున్నాడు. ఆఖరి ప్రయత్నంకూడా విఫలమయ్యేటప్పటికి అతనికి వివాహం అంటే వైముఖ్యం కల్గింది. మళ్లీ మూడేళ్ల పిమ్మటగాని అతనికి వేరే సంబంధం చూసుకోటంలో విజయం లభించలేదు. సమాజంలో పేరుపొందిన 'టాన్' కుటుంబీకుల యువతిని వివాహం చేసుకోబోతున్నాడు. అమ్మాయి బాగా చదువుకుంది. అందకత్తె అని పేరువుంది. అందరూ 'వీ'ని అభినందించారు. వివాహప్రయత్నాలు జోరుగా సాగుతున్నాయి. కాని పాపం వీ ఒకరోజునతలవనితలంపుగా ఓదుర్వార్త వినవలసివచ్చింది. అతని వధువు ఆత్మహత్య చేసుకుంది. కారణం—ఆమె తన హృదయాన్ని ఇదివరకే ఇంకొకళ్ళకు అర్పితం చేసింది.

రెండేళ్ళవరకు మళ్లీ వీ వివాహప్రసక్తి తేలేదు. అపుడే అతనికి 28 సంవత్సరాలు వచ్చాయి. 'ధనికసమాజంలో పిల్లనే పెళ్లి చేసుకోవాలి' అనే కోరికకు స్వస్తి చెప్పాడు. ఒకసారి ఓవూరు వెళ్లినపుడు అక్కడ దేవాలయంలో బసచేశాడు. అక్కడో రైతు కుమార్తెను చూచాడు. ఆమెని ప్రేమించాడు. అంతే కాదు ఆ అమ్మాయి కూడా వీని అమితంగా ప్రేమించింది. వివాహం చేసుకో

## విధిలిఖితం

టానికి నిశ్చయించుకున్నారు. వీ నగలు, బట్టలు కొంటానికి రాజధానికి వెళ్లాడు. పాపం, అతను తిరిగి వచ్చేటప్పటికి ప్రియురాలు తీవ్రమైన వ్యాధికి గురయింది. స్వస్థత చేకూరేదాకా ఆగటానికి ఒప్పుకున్నాడు వీ. కాని వ్యాధి రోజురోజుకూ ఎక్కువవుతోంది. ఇట్లా సంవత్సరం గడిచింది. అమ్మాయికి జుట్టంతా రాలిపోయింది. అంధత్వం ప్రాప్తించింది. ఆ అమ్మాయి వీని వివాహం చేసుకోటానికి నిరాకరించింది. తన మీద ఆశ వదులుకోమని, తగిన కన్యను చూచి వివాహం చేసుకోమని చెప్పింది.

మళ్లీ స్థిరమైన సంబంధం కుదిరేటప్పటికి కొన్ని సంవత్సరాలు పట్టింది. నవవధువు యువతి, సౌందర్యవతి మాత్రమే కాదు. సాహిత్యం అంటే తగని ప్రేమ. సంగీతకళాభిమాని. వెంటనే వివాహం నిశ్చయం చేసుకున్నారు. వివాహం ఇంకా మూడురోజులుందనగా—

ఆ అమ్మాయి పేవ్‌మెంట్ మీద నడుస్తూ పాకుడు బట్టిన రాయి మీద కాలేసింది. దాంతో జారి క్రిందపడి మరణించింది. పాపం! విధి కోరలు చాపుకుని 'వీ'ని వెంటాడుతున్నట్టుంది.

వీపూర్తిగా "అంతా దైవాధీనం" అనే మతంలోకి దిగజారాడు. ఇంకా ఏమాత్రం వివాహప్రసక్తి పెట్టుకోకూడదనుకున్నాడు. 'షియాంగ్ చౌ'లో ఏదో ఉద్యోగం చేస్తున్నాడు. తన పనేదో తను అతి జాగ్రత్తగా నిర్వర్తించుకుపోతున్నాడు. 'మేజస్ట్రేటు వాంగ్‌టాంయ్' తన మేనకోడల్నిచ్చి వివాహం చేస్తానన్నాడు. అంతబాగా పని చేస్తున్నాడన్నమాట వీ.

ఈ విషయం "వీ"కు చాలా బాధగా తోచింది.

"మీ మేనకోడల్నిచ్చి నాకెందుకు పెళ్ళి చెయ్యదల్చుకొన్నారండి? వివాహం చేసుకునే వయస్సు మీరిపోయింది నాకు" అన్నాడు వీ.

తనకంత ఉత్సాహం లేకపోయినా మేజస్ట్రేటుగారి బలవంతం వలన వివాహానికి అంగీకరించాడు. వివాహం అయ్యేవరకు అతను వధువును చూడలేదు. ఆమె అతనికి అన్నివిధాలతగిన భార్య. అందుకు సంతోషించాడు.

వీ భార్య తన శిరోజాల్ని ఎపుడూ చిత్రమైన విధంగా నుదురుకు కుడికణత భాగాన్ని కప్పేటట్టుగా అమర్చుకునేది. అందంగానే వుందికాని ఎందుకనో ఎప్పుడూ ఇట్లానే కడుతుంది అని ఆశ్చర్యం వేసింది వీకు. కాలం దొర్లుతోంది. "ఎపుడూ శిరోజాల్ని ఒకప్రక్కనే వుండేటట్లు అమర్చుకుంటావు ఎందుకని? కొత్తపద్ధతుల్లో అమర్చుకోకూడదా!" అని అడిగాడొకరోజున వీ

భార్య శిరోజాల్ని పైకెత్తి పట్టి "చూడండి" అని గాయంవల్ల కలిగిన ఒక మచ్చచూపెట్టింది.

"ఏమిటి, ఎట్లాతగిలిం దిది?"

"నాకుమూడేళ్ళ ప్రాయమపుడు తగిలింది దెబ్బ. మానాన్న ఉద్యోగం చేస్తూమరణించారు. అదే సంవత్సరం మా అమ్మ, అన్నకూడా చనిపోయారు. నన్నూ నాకు పాలిచ్చే దాది పెంచింది. మాకు, మా నాన్న ఉద్యోగం చేసినచోట సంగ్ చంగ్ దక్షిణద్వారంవద్ద ఇల్లుకట్టి వుంది. నా దాది కూరగాయలు కాయిస్తూ అక్కడే మార్కెట్లో అమ్ముతుండేది." ఒకరోజున ఎందుకో మరి నిష్కారణంగా నన్నో దొంగ చంపటానికి ప్రయత్నించాడు. మాకెవ్వరూ విరోధుల్లేరు. వాడైతే నన్ను చంపలేకపోయాడు గాని వాడి కత్తిదెబ్బ శాశ్వతమైన ఒక మచ్చను ప్రసాదించింది నా నుదుటిమీద. అదే దాన్ని కప్పిపుచ్చటానికి కారణం.

"ఏదాది పూర్తిగా అంధురాలు కదూ?"

"అవును, మీకెట్లా తెలుసు!"

"నేనే ఆ దొంగను. చాలా చిత్రంగా వుంది. అంతా విధికనుగుణంగా జరిగింది."

సరిగ్గా పధ్నాలుగేళ్ళ క్రితం తను దేవాలయంవద్ద వృద్ధుడ్ని కలుసుకున్నప్పటినుంచీ జరిగిన చరిత్రంతా చెప్పాడామెకి. ఆరేడేళ్ళపుడు ఆమెని తన మేనమామ సంగ్ చెంగ్‌లో చూచి వీ ఆమె నిప్పుడు చూచినచోటికి, తన కుటుంబంతో నివసించటానికి తీసుకొచ్చాడని చెప్పింది వీ భార్య. అపుడు తెల్సుకున్నారు వాళ్ళ వివాహం ఎపుడో దేవలోకంలోనే నిశ్చయమయిందని.

కొంత కాలానికి వారికి "కున్" అనే పుత్రుడు జన్మించాడు. వాడు పెరిగి పెద్దవాడై కాలవశాత్తు 'సైయున్' పట్టణానికి మేజస్ట్రేటు అయ్యాడు. వీ భార్య కుమారుడి కారణంగా సమాజంలో గౌరవనీయమైన స్థానాన్ని అందుకుంది.

(లిన్యుటాంగ్ ఇంగ్లీషులోకి అనువదించిన ఒక చైనీస్ కథకు అనువాదం)

# విజ్ఞానవీధులు

"డాక్టర్"

## చిట్టిప్రశ్నలకు జవాబులు

డి. వి. హనుమంతరావుగారు,
దావులూరు.

—భూమి సూర్యుడినుంచి విడిపోయి, క్రమముగా ఉపరిభాగము చల్లబడినా గర్భమందు కొలిమిరీతిగానే మండుతున్నది. ఆ వేడికీ, దానివల్ల తయారైన గాలుల ఒత్తిడికీ ఆగలేక భూమి ఉపరిభాగము దారి యిచ్చేస్తే చిచ్చుబుడ్డిలో నుంచి వచ్చినట్లు, కరిగిన రాళ్ల ద్రవము చిమ్ముకొని వస్తుంది. ఇది చల్లారి, ఆ బిలముచుట్టూ కొండగట్టువలె ఏర్పడుతుంది. అదే 'అగ్ని పర్వతము' మళ్లీ భూగర్భంలోని 'కళపెళ' దీనివైపు విజృంభించినప్పుడు ఈ పర్వతము అగ్నిని విరజిమ్ముతుంది.

వింజమూరి సరస్వతీదేవి, మంగళగిరి.

—భూకంపము భూమిలో కలిగే కలవరమునుబట్టి కలుగుతుంది. ఈ కలవరమునకు చేరువగా భూమి ఉపరిభాగాన్న ఉన్న చోటును ఎపిసెంటరు అంటారు. ఈ ఎపిసెంటరునుండి భూకంపము భూమికి అన్ని వైపులా వ్యాపిస్తుంది. అయితే భూమి పొరలు ఈ కంపమునకు కలిగించే నిరోధము వల్ల - నీటిమీది కెరటము కొంత దూరము వెళ్లి ఆగిపోయినట్లే - భూకంపపు ఉద్ధృతము క్రమంగా తగ్గిపోతుంది. అందువల్లనే భూమి అంతా కంపించదు.

టి. పానకాలు, నల్లగొండ.

—మత్స్యావతారపూజ జరిగేచోటు మాకు తెలియదు. కూర్మావతారమును శ్రీ కూర్మములోనూ మార్కాపురములోనూ ఆలయాలలో పూజిస్తారు. వరాహస్వామి తిరుపతిలో నున్నాడు. అసలు తిరుమల ఆయనదట. ఆయనఒప్పందలమీద, మొదటి అర్చన ఆయనకు జరిపించే నియమము మీదనే వెంకటేశ్వరస్వామి తిరుమలలో ప్రవేశించెనట! సింహాచలస్వామిని "వరాహనరసింహస్వామి" అందురు. స్వామి నిజరూపము వరాహాకృతిగానే ఉండును.

—దీపముదగ్గరకు చేయి తీసుకవెళ్లునప్పుడు క్రమముగా వేడి హెచ్చినట్లేకొండమీదకు వెళ్లినప్పుడూ వేడి హెచ్చును. అయితే కొండకి చుట్టూవున్న గాలి చల్లగా ఉండుటవల్ల కొండ చల్లగా ఉండును. నీలగిరి మీదనైనా ఎండలో తిరిగితే వడ గొట్టుట కలదు.

ఆర్. వి. కృష్ణారావుగారు, విజయనగరం.

—ముక్కు పొడుము వాసనకి అందరికీ మొదట తుమ్ములు వస్తాయి. అయితే అలవాటు చేసుకున్న వారిలో తుమ్మించే నరాల సున్నితత్వము మొద్దుబారిపోతుంది. అదే రీతిగా పెన్సిలీన్ పుచ్చుకొన్న వారిలో రోగక్రిములకు కావలసిన పదార్థాన్ని పెన్సిలీన్ హరించేసి రోగాన్ని నివారిస్తుంది. అందుకే పెన్సిలీనును ఆంటీబయాటిక్ (జీవవిరోధి) అన్నారు. రోగాన్ని నివారించడానికి చీటికి మాటికి పెన్సిలీనునే సేవిస్తే పనిలేని పెన్సిలీను శరీరవర్ధకములగు జీవకార్యములవైపు తిరుగుతుందనవచ్చు. అంటే విషక్రిములను చంపడానికి పనికివచ్చే పెన్సిలీను జీవాన్ని నాశనం చెయ్యడానికి సాయపడుతుంది.

యస్. సుబ్బారావుగారు, హైద్రాబాదు.

—ఒకరు కన్నీరు పెట్టినప్పుడు ఇంకొకరు కూడా కన్నీరు పెట్టడమూ, ఒకరు ఆవలించినప్పుడు ఇంకొకరు ఆవలించడమూ - వీణ తీగలలో ఒకదాన్ని మోగిస్తే శ్రుతి తీగలు జల్లుమనేటట్లు - అనురణనము అనవచ్చును. గుంపులో ఉన్నవారు, ఎవడో ఒకడు 'తన్నండిరా పట్టుకుని' అంటే ఆలోచన చెయ్యకుండానే తన్నడానికి సిద్ధమవడము కూడా ఈరకమే. ఒకరు ఆవలించగా చూసినప్పుడు మెదడులో ఆవలింతను నడిపే కేంద్రమునకు గిలిగింతపుట్టి ఆ వ్యక్తినికూడా ఆవలించేటట్లు చేయిస్తుంది. అయితే దగ్గూ తుమ్మూ ఇలాగ చెయ్యలేమని మీరు అడగవచ్చును. అవి గొంతులోనూ, గాలిగొట్టములోనూ కలిగిన అల్లరివల్ల వస్తాయి. ఆవలింత నిద్రమత్తువల్ల వస్తుంది. ఒకరిచేత దగ్గించగలము, తుమ్మించగలము, ఆవలింపించలేము. ఆవలింత నిద్రాసక్తతవల్ల వచ్చేది. ఇది అందరికీ ప్రతీరోజూ అనుభవము. కనక ఒకరి ఆవలింతచూస్తే తక్కినవారికీ ఆ కల వరమే కలగటానికి బాగా వీలు. అయితే తప్పనిసరి కాదు. ★

## గ్రంథ స్వీకారం

జాతక పరిశీలనము:—ప్రథమ భాగము (జాతకపరిచయము) గ్రంథకర్త: కొంపెల్ల సుబ్బారావు; వెల 2-0-0; ప్రకాశకులు: జ్యోతిష్సాహితీ ప్రచురణాలయం; గాంధీనగరం, విజయవాడ - 2. జాతకశాస్త్రము గూర్చి శాస్త్రీయముగా తెలుసుకొనగోరు వారికి ఉపకరించే గ్రంథం.

సస్యజాతకము:—ప్రథమ భాగము; కర్త: వేమూరి దక్షిణామూర్తి; వెల: 3-0-0; ప్రకాశకులు: జ్యోతిస్సాహితీ ప్రచురణాలయం, విజయవాడ. పైరుపంటలకు సంబంధించిన జ్యోతిషఫలములను పరిశీలించగోరు వారికి ఈ గ్రంథం ఉపకరిస్తుంది.

వైద్యవిషయిక జ్యోతిషము:—కర్త: వేమూరి దక్షిణామూర్తి; వెల 2-0-0; ప్రకాశకులు: జ్యోతిస్సాహితీ ప్రచురణాలయం, విజయవాడ. జ్యోతిషశాస్త్రమునకు, వైద్యశాస్త్రమునకు గల సంబంధమును ఈ గ్రంథం తెలియజేస్తుంది.



"విజయగౌరి"లో గౌరిపాత్రధారిణి పద్మిని.



వాహినీవారి "బంగారుపాప"లో కృష్ణకుమారి, రామశర్మ.

# పిల్లలచిత్రాలు ఎక్కువగా తయారుకావాలని డా॥ కేస్కార్

మన దేశంలో పిల్లల చిత్రాలు ఇతోధికంగా తయారు కావాలని, వాటివల నే పిల్లలకు వినోద విజ్ఞానాలు లభిస్తాయనీ, పెద్దల చిత్రాలు ఇందుకు పనికిరావనీ భారత సమాచార శాఖామంత్రి డా॥ బి.వి. కేస్కార్ ఇటీవల ఉద్ఘాటించారు. బొంబాయిలో జరిగిన బాలచిత్రోత్సవాన్ని ప్రారంభిస్తూ ఆయన ఇంకా ఇలాగన్నారు: "పిల్లల చిత్రాలు లాభదాయకాలు కాకపోవడంమూలాన నిర్మాతలు ఈ విషయంలో ముందంజ వేయడంలేదు. కాని పాశ్చాత్యదేశాల్లో పిల్లల చిత్రాలమీద ప్రత్యేకశ్రద్ధ కలిగిన సంస్థలు ఈ రంగంలో మంచి కృషి చేస్తున్నాయి. ప్రతిదీ ప్రభుత్వపు అజమాయిషీలో ఉండే సోవియెట్ రష్యాలో పిల్లల చిత్రాల నిర్మాణం బాగా అభివృద్ధి చెందింది. మనదేశంలో కూడా పిల్లల చిత్రాల నిర్మాణాన్ని ప్రభుత్వం తన చేతుల్లోకి తీసుకోవాలని నిర్ణయించింది. ప్రభుత్వం అలా చెయ్యకపోతే అసలు పిల్లల చిత్రాలే నిర్మించబడకుండా పోయే ప్రమాదం ఉన్నది. అందుచేత ప్రభుత్వం ఒక బాలచిత్ర సంఘాన్ని స్థాపించడానికి నిశ్చయించింది. ఈ సంఘం ప్రత్యేకంగా పిల్లల చిత్రాలు నిర్మించడంలోనే నిమగ్నమై ఉంటుంది. బాగా ధనవంతులైన వారు కూడా ఈ విషయంలో ముందడుగు వేస్తారని ఆశిస్తున్నాను."

బొంబాయిలో ఆరురోజులపాటు జరిగిన బాలచిత్రోత్సవంలో 25 విదేశీచిత్రాలు ప్రదర్శింపబడ్డాయి. బెంగాలీ బాలచిత్రం "ఖేలాఘర్" కూడా ప్రదర్శింపబడింది. బొంబాయి రాష్ట్రమహిళాసంఘంవారు ఈ ఉత్సవం ఏర్పాటు చేశారు.

# ఆవారా, అంధియాన్, దో బిఘా జమీన్

దాదాపు మూడేళ్ళక్రిందట మనదేశంలో అంతర్జాతీయ చలనచిత్రోత్సవం జరిగినతరువాత, చెప్పుకోదగిన విశేషం మనదేశపు చిత్రాలు రష్యాలో ప్రదర్శించబడడం, లక్షలకొలది ప్రజలు వాటినిచూసి ఆనందించడం. రష్యానుంచి తిరిగివచ్చిన బొంబాయి ఫిలిం వ్యక్తులు అక్కడ తమకు, తమ చిత్రాలకూ ఇవ్వబడిన బ్రహ్మాండమైన స్వాగతాన్నిగూర్చి ఒకరికంటె ఒకరు ఉత్సాహకరమైన అంశాలు వెల్లడిస్తున్నారు.



"పల్లెపడుచు"లో పేకేటి శివరాం.

వీరి ప్రకటనలనుబట్టి, రష్యన్లు చూపిన సుహృద్భావం, మన చిత్రాలపట్ల వారు చూపిన ఆసక్తి నిజమైనవేగాని తెచ్చి పెట్టుకున్నవి కావని విశదమౌతున్నది. అయితే ఈ ఉత్సాహప్రదర్శనమంతా అక్కడి ప్రభుత్వం నడిపించిన నాటకమనీ, రష్యాలో ప్రభుత్వం తయారుచేసే ప్రచార చిత్రాలు చూసిచూసి విసుగెత్తివున్న ప్రజలు, 'ఏమైతే నేం కొత్తరకం చిత్రాలు వచ్చాయికదా, చూద్దాం' అని మాత్రమే భారతీయ చిత్రాలను ఆదరించారనీ ఆరోపించేవారు లేకపోలేదు. బొంబాయినుంచి వచ్చే ఒక ఇంగ్లీషు సినిమాపత్రిక ఈ రకమైన దృక్పథాన్ని ప్రదర్శిస్తూ ఒక సంపాదకీయం వ్రాసింది. ఈ దృక్పథాన్నిబట్టి ఆ పత్రికకు భారతీయ చిత్రాలపట్ల ఎంత హీనాభిప్రాయం ఉన్నదో వ్యక్తమవుతున్నది. రష్యన్ ప్రభుత్వం ఏదో దయతలచి భారతీయ చిత్రాలను ప్రదర్శించిందనీ, అందుచేతనే అంతమంది రష్యన్ ప్రజలు వాటిని చూశారు గాని భారతీయ చిత్రాలపట్ల, సంస్కృతిపట్ల వారికి ఆసక్తి ఉండి కాదనీ, అమెరికాలో మన చిత్రాలు ప్రదర్శింపబడడం లేదంటే మన చిత్రాలో సరుకు లేకపోవడంవల్లనేననీ ఆ పత్రిక ఆరోపణ.

అయితే రష్యా, అమెరికాలలో పర్యటించివస్తున్న భారతీయ ఫిలిం వ్యక్తుల ప్రకటనలు ఈ ఆరోపణలు ఎంత ఆధారరహితాలో నిరూపిస్తున్నాయి. రష్యాలో అచ్చగా రష్యన్ చిత్రాలే కాకుండా అనేక యితరదేశాల చిత్రాలు ప్రదర్శితమవుతున్నాయని వారు చెబుతున్నారు. ఇక అమెరికాలో తయారయ్యే చిత్రాల్లో అన్నీ టెక్నికల్‌గా ఉత్తమంగా ఉండడం లేదనీ, కొన్ని మనదేశపు చిత్రాలకంటె తక్కువ స్థాయిలో ఉంటున్నాయనీ, అటువంటి తక్కువరకం చిత్రాలు పైదేశాలకు ఎగుమతికావు కనుక మనం అన్ని అమెరికన్‌చిత్రాలూ మంచివేనని భ్రమపడుతున్నామనీ ఇటీవలే అమెరికానుంచి తిరిగి వచ్చిన ఒక పెద్ద బొంబాయి నిర్మాత చెప్పాడు. ఇది నిజమైతే మన చిత్రాలు అమెరికన్ మార్కెట్‌లో పురోగమించకపోవడానికి, వాటిలో సరుకులేకపోవడం కాక వేరే కారణాలుండి వుండాలి.

రష్యాలో మన చిత్రాలు ప్రదర్శింపబడడానికి రష్యన్ ప్రభుత్వం శ్రద్ధ తీసుకోవడమే ముఖ్యకారణమైనప్పటికీ, అదంతా వట్టి నాటకమనీ, వారు భారతీయులను మంచిచేసుకోవడానికే ఆ నాటకం తలపెట్టారనీ అనుకోవడానికి అవకాశంలేదు. రష్యన్ చిత్రం కాకపోతే సరి దేన్నిపడితే దాన్ని వారు చూసి పొంగిపోతారనుకోడానికి కూడా వీలులేదు. మన చిత్రాలను వారు విమర్శనాపూర్వకమైన దృష్టితోనే చూసి బాగున్న అంశాలనే మెచ్చుకున్నారనీ, తమకు నచ్చనివాటిని విమర్శించారనీ అనడానికి నిదర్శనంగా ఒక వ్యాసం ఇటీవల "న్యూస్" అనే సోవియెట్ పత్రికలో పడింది. ఈ వ్యాసం రష్యన్ల నిజాయితీకి తార్కాణం. దీన్ని తమారా మకారోవా అనే ఫిలిం నటి వ్రాసింది.

"దోబిఘాజమీన్" చిత్రంలో పేదరైతు తన హక్కులకోసం పడే అవస్థ చిత్రింపబడిందనీ, ఈ చిత్రంలో బల్రాజ్ సానీ చూపిన నటనాకౌశలాన్నిబట్టి అతనినీ గొప్ప నటుల్లో చేర్చవచ్చుననీ, చిత్రం చూస్తుంటే పాత్రల కష్టసుఖాల్లో ప్రేక్షకులుకూడా లీనమైపోతారనీ ఆమె వ్రాసింది. బల్రాజ్, నిరూపరాయ్‌లు సృష్టించిన పాత్రలద్వారా భారతదేశంలోని సామాన్య వ్యక్తిలో ఉండే ఉత్తమలక్షణాలన్నీ

మూర్తీభవించినట్లయినా యని కూడా ఆమె వ్రాసింది.

"ఆవారా" నుగూర్చి వ్రాస్తూ ఇది చాల ముఖ్యమయిన కళాఖండమని ఆమె అన్నది. "సాంఘిక అసమానత్వంవల్ల, విభేదాలవల్ల యువకులు ఎలా నేరస్థు లవుతున్నారో స్క్రిప్టు రచయిత బాగా చిత్రించాడు. డైరెక్టరుగా రాజ్ కపూర్ గొప్ప నేర్పు చూపించాడు..." అని మకారోవా వ్రాసింది. అయితే ఆ చిత్రంలోని లోపాలను ఎత్తిచూపడానికి ఆమె వెనుదీయ లేదు. "ఈ యువదర్శకుడు కొన్ని అసందర్భపు సన్నివేశాలను ప్రవేశపెట్టడం విచారించదగిన విషయం. జీవిత వైరుధ్యాలను చూపించడంలో స్క్రిప్టును చక్కగా అనుసరించినప్పటికీ, కొన్నికొన్ని దృశ్యాలను కేవలం టెక్నికల్ ఎఫెక్టుకోసమే ఈయన ప్రవేశపెట్టినట్టు తోస్తుంది. మెలోడ్రమెటిక్ సన్నివేశాలు కూడా చాలా కనిపిస్తాయి. స్క్రిప్టు రచయిత ఆశించినదానికంటె భిన్నమైన భావాలను అతడు ప్రవేశపెట్టినప్పుడల్లా అతని నటన కూడా దెబ్బతినడం కనిపిస్తుంది."

రాజ్ కపూర్, నర్గిస్‌ల నటన చాలా బాగున్నదని చెబుతూ, నర్గిస్ కొన్ని దృశ్యాల్లో చైతన్యరహితంగా ఉన్నట్లు కనిపిస్తుందనీ, అయితే ఆ దోషం ఆమెది కాదనీ, పశ్చిమ యూరపియన్ ఫిలిముల లోని పాత సంప్రదాయాలను అనుకరించిన దర్శకునిదే ఆ దోషమనీ ఆమె వ్రాసింది.

"ఆంధియాన్" చిత్రాన్ని గూర్చి వ్రాస్తూ ఇందులో కథ ప్రేమకథ అనీ, మామూలు ఇతివృత్తం అయినప్పటికీ డైరెక్టరూ, నటులూ దాన్ని చాలా నేర్పుతో ప్రదర్శించారనీ, ఇందులోని సమూహ దృశ్యాలనుబట్టీ, మంచి సంగీతాన్నిబట్టి అది కళాఖండం అనదగి వున్నదనీ ఆమె వ్రాసింది.

ఈ వ్యాసంమూలంగా భారతీయ చిత్రాలను రష్యన్లు ఏ దృక్పథంతో పరిగణించిందీ స్పష్టమవుతున్నది.

★



# ప్రేక్షకుల అభిప్రాయాలు



## "కాళహస్తిమహాత్మ్యం"

గుబ్బి కర్ణాటకవారు నిర్మించిన "కాళహస్తిమహాత్మ్యము" చిత్రము ఆస్తికుడనబడే ప్రతివాడికి ఎన్నిసార్లు చూసినా తనివి తీరదు. ఈశ్వరునిచే కిరాతుడుగా మోసపోయిన అర్జునుడు మరు జన్మలో, బోయలకుదొరికి, బోయవాడుగా పెరిగి, వారిచే భార్యాసమేతముగా వలి వేయబడి కాళహస్తి చేరి బోయతిన్నడై కాళహస్తీశ్వరుని సేవించి, ఈశ్వరానుగ్రహమునకు పాత్రుడై మహాభక్తుడై వెలసినాడు. పురాణకథగా పరిశీలించినా, చిత్రరూపంగా పరిశీలించినా ఆ మహాభక్తుని గాథ మరువరానిది. మూలకథలో లేని క్రొత్త పాత్రలు చిత్రించి చిత్రకథాగమనానికి, చిత్రవిజయానికి తోడ్పాటు చేసికొన్నారు. కాశీ, చింతామణి, శ్రీహరి, బసవారెడ్డి పాత్రలు చిత్రకథాగమనానికి మాత్రమే యున్నట్లు తోస్తుంది.

మూలకథలో మహాభక్తుడైన శివబ్రాహ్మణుని పాత్రను చిత్రంలో కైలాసనాథ శాస్త్రిగా సృష్టించారు. ఆ పాత్రమూలముగా ముఖ్యముగా చింతామణి, శ్రీహరి పాత్రలు; కాశీ, గౌరి పాత్రలు సృష్టించుటకు వీలుకలిగినది. మూలకథకు పూర్తివ్యతిరేకంగా కైలాసనాథశాస్త్రిని అతి క్రూరునిగా ఎందుకు సృష్టించారో అన్నవిషయం ఊహించటం కొంచెం కష్టమే.

కైలాసనాథశాస్త్రిగా లింగమూర్తి ఉత్తమంగా నటించాడు. రాజకుమార్ చిత్రరంగానికి నూతనుడైనా అత్యుత్తమంగా నటించాడు. మూలకథలో లేకపోయినా కాశీ పాత్ర సృష్టించి, సద్మ నాభంచే ఆ పాత్రకే కాక చిత్రానికే జీవం పోయించారు. చిత్రంలో ఋష్యేంద్రమణి పాత్ర ప్రాముఖ్యం చిత్రనిర్మాతలకే తెలియాలి. తక్కిన పాత్రధారులంతా సంతృప్తికరంగా నటించారు. తోలేటివారి పాటలు, మాటలు బాగానే వున్నాయి. ఫొటోగ్రఫీ చక్కగా వుంది. ఘంటసాలవారి పాటలు, సుదర్శనంగారి సంగీతము వీనులవిందుగా వున్నాయి. డైరెక్షన్ బాగుంది. ఒక భక్తుడి మహోజ్జ్వలగాథను చిత్రంగా నిర్మించినందుకు గుబ్బి కర్ణాటకవారు అభినందనీయులు.

**టి. వి. నరసింహారాయశర్మ**

**—గుడివాడ.**

*  *  *

ఈమధ్య విడుదలైన తెలుగు సినిమాలను చూస్తుంటే, సినిమాలమీద చెడ్డ చిరాకు కలుగుతుంది. హిందీ అనుకరణలతోను, అసభ్య నటనలతో కూడిన మన తెలుగు



లక్స్ టాయిలెట్ సబ్బు కంపెనీవారు లక్స్‌వర్డ్స్ పజిల్ పోటీలో గెలుపొందినవారికి ఇటీవల మైలాపూర్, కామధేను థియేటర్‌లో బహుమతులు పంచిపెట్టారు. సినీతార అంజలీదేవి ఈ బహుమతులను స్వహస్తాలతో అందజేసింది. పై ఫొటోలో ఉన్నవారు అంజలీదేవి, లీవర్ బ్రదర్స్ లిమిటెడ్ వారి జనరల్ సేల్స్ మేనేజరు ఆర్. రామస్వామి, ప్రోడక్టు మేనేజరు గోస్వామిగార్లను, ఒక బహుమతిగ్రహీతను చూడవచ్చును.

# ప్రేక్షకుల అభిప్రాయాలు

సినిమాలు వినోదానికి బదులు చాల విసుగును కల్గిస్తున్నవి.

కాని, గుబ్బి కర్ణాటకవారు "కాళహస్తి మహాత్మ్యము" తీసి ప్రేక్షకుల అభిమానమునకు పాత్రులైరని ఘంటాపథముగ చెప్పవచ్చు. కథావిధానము పాతదైనప్పటికీ, మనోరంజకంగా చిత్రించారు. అనతికాలంలోనే చిత్రం పూర్తిచేసినప్పటికీ, కథావిధానములోగాని, నటనలోగాని సాధ్యమైనంతవరకు లోపములు లేకుండ చిత్రించారు. ఈ విషయములో నిర్మాతలను అభినందించవలసినదే! దర్శకత్వము, ఛాయాగ్రహణము చాల ఉత్తమస్థాయిలో నున్నవి. కాని శబ్దము కొన్నిచోట్ల బాగా లేదు. లింగమూర్తి గారి నటన కొన్నిచోట్ల బాగా లేనప్పటికీ, మొత్తంమీద ప్రశంసింపదగినవారే.

టి. జయదేవ్—గుంటూరు.

* *

'కాళహస్తిమహాత్మ్యం' చిత్రం ప్రేక్షకుల్ని భక్తిరసంలో ముంచివేస్తుంది అనడంలో సందేహం లేదు. నిజమైన దైవభక్తి ఎలా వుండాలో అది నిరూపించింది. నాస్తికమతం అవలంబించి, దేవుడు లేడని ఎగతాళిచేసేవారు, భక్తిగలవారూ - కూడా ఈ చిత్రం చూడవలసిందే. హాస్యంకూడా వెగటుగాకాక, సరిగ్గానే నడిచింది. లోపాలు ఎక్కడో నూటికొకటివున్నా ఎంచదగ్గవి కావు. లింగమూర్తి తన పాత్రను బాగా నిర్వహించాడు; చెప్పాలంటే ప్రతీవారూ ఎవరిపాత్రని వారు చక్కగా నిర్వహించారనడంలో సందేహం లేదు. బోయ తిన్నయ్యకి 'పంచాక్షరి' మంత్రం చెప్పబోయ్యేముందు "ఇక్కడ సాలీడు, పాము, ఏనుగు - ఒకేసారి మోక్షాన్ని పొందాయి" అని చెప్పే సందర్భంలో ఆవిధంగా జరగడంకూడా చూపిస్తే, ప్రేక్షకులు మరింత సంతోషం పొందేవారు. పాటలు, ఒకటో రెండోతప్ప మిగతావన్నీ చాలా బాగున్నాయి. సెట్టింగ్సు కూడా బాగానే వున్నాయి. ప్రతీవ్యక్తీ చూడవలసినచిత్రం. 'కాళహస్తిమహాత్మ్యం' నిర్మించిన గుబ్బి కర్ణాటకప్రొడక్షన్సువారికి నా అభినందనలు.

బొడ్డు సుబ్బారావు,
—విశాఖపట్టణము.

* * *

ఒక క్రొత్త ఫిల్ముకంపెనీ ప్రథమచిత్రం "కాళహస్తి మహాత్మ్యమ్." ఒక్క శివయ్యతప్ప యాసతో మరెవరూ బాధించలేదు. సినీమా అనగానే కావలసినది పేరు. నామకరణంలోనే తప్పటడుగు వేశారు. "శ్రీకాళహస్తి మాహాత్మ్యం" అనేది సరియైన పదం. మహాభక్తుడు కానున్న తిన్నడికి 'కాశి' 'ఓనామఃశివాయః' అని మంత్రోపదేశం చేశాడు. ఓం నమశ్శివాయ" అని అసలు స్వరూపం. పాటల రచన బాగులేదు. హాస్యం అవసరమైనప్పుడు కూడా కలం చురుకులేదు. అరువు తెచ్చుకున్న హాస్యం. మాటల్లో రసపుష్టి లేదు. తెరమీద బొమ్మలు ఏడవడమే కాని ప్రేక్షకుల్లో మూడువంతులుమంది విలపించరు. అప్పుడప్పుడు గ్రాంధికంగా రచన సాగింది. ఈ చిత్రం విజయంపొందితే దానికి కారణం లింగమూర్తి ఒక్కరే. తక్కినవాళ్లు యథాశక్తిగా యథోచితంగా నటించారు.



"వదినెగారి గాజులు" షూటింగ్ విరామసమయంలో నటి నజము.

కుచలకుమారి నృత్యం బాగుంది. ఇక సంగీత విషయం. అందరికీ తెలిసేటట్లు హిందీ ట్యూన్స్ దొంగిలిస్తే అది పబ్లిక్ దొంగతనం. అలా కాక ప్రతి పాత పాటలోనూ స్టైయిల్స్ కత్తిరించి అతుకులు వేసి బొంత చేశారు. మెత్తగానే వుంది కాని అతుకులు అతుకులే! కొన్ని పాటలు ఫిల్ముయుగం ప్రారంభంనుండి వాడబడుతున్న నలిగిన కర్నాటక సంగీతపు బాటలో నడిపారు. డైరెక్షన్ కొత్తవారయినా ఇంచుమించు జాగ్రత్తగా వుంది. బాగా కనబడేవి కొన్ని లోపాలున్నాయి. తిన్నడిని కూటమినుండి బహిష్కరించడానికి తగినంత కారణం లేదు. నాయకీ నాయకులకు వయసు వచ్చినతరువాత కొన్నాళ్లు ఒక జంటను మరికొన్నాళ్లకు మరిద్దర్ని ఎన్నుకోవడం అనవసరం. అసలు శ్రీ కాళహస్తి మాహాత్మ్యం తెలిపే సాలెపురుగు, పాము, ఏనుగుల కథను 'కాళి' చేత అనిపించినపుడే పిక్చరైజ్ చేస్తే బాగుండును. ఆ కథనే ఆశించి వచ్చిన ప్రేక్షకులకు ఆశాభంగమైంది.

సౌండ్ రికార్డింగ్ శ్రుతిపేయంగా, ఇంపుగా వున్నది. రసవత్తరఘట్టాల్లో బాక్‌గ్రౌండ్ మ్యూజిక్ రసానుగుణంగా లేకపోవడమే కాక విభిన్నంగా వున్నది.

"కన్నసామి"—విజయనగరం.

* * *

కథ ఒకరకంగా ఉన్నది. ఈ చిత్రమే ఐదు, ఆరు సంవత్సరములకు ముందు వచ్చియుంటే విజయవంతమయ్యేడిది. కాని సాంఘికాలతో విసుగెత్తిన ప్రేక్షకులకు యీ చిత్రము కొంతవరకు ఆనందమును చేకూర్చగలదు. కైలాసనాథశాస్త్రిగా లింగమూర్తి, కాళిగా పద్మనాభం, నీలగా మాలతీ, గౌరిగా కుమారి తమతమ పాత్రలకు న్యాయం చేకూర్చారు. తిన్నయ్యగా రాజకుమార్ ఆఖరుఘట్టములో అద్భుతముగా నటించాడు. తోలేటిగారి మాటలు వినసొంపుగా యున్నవి. ఆర్. సుదర్శన్‌గారి సంగీతంలో అచ్చటచ్చట "సంఘం" సంగీతం యిమిడి యున్నది. ఘంటసాల పాడిన పద్యములు, పాటలు బాగున్నవి.

ఫిలోమినదాస్—గుంతకల్.

★

## అమర సందేశం

అమరసందేశమనే ఒక క్రొత్త సందేశాన్నిచ్చే తెలుగు చిత్రాన్ని చూచాను. నిర్మాతలు క్రొత్తవారైనా ఎంతో జనరంజకంగా నూతన కథావిధానంతో వివిధమైన అతుకులూ లేకుండా నిర్మించారు.

కథాగమనంలో విద్యానాథుడు, శారద పాత్రలకు మినహా మిగతా పాత్రలకు ఎక్కడా ప్రాముఖ్యమిచ్చినట్లు లేదు. చిత్రం సగభాగంపైవరకూ చాల నిదానంగా నడిచింది. సంగీతం బాగున్నా సంగీత ఇతివృత్తంగల చిత్రానికి ఆ సంగీతం చాలదేమో అనిపించింది. ప్రజలు పాడుకుంటానికి అనుగుణంగావున్న పాటలు లేవు. సంభాషణలు ఒకఫక్కీని నడవలేదు. కాని కథను నడిపించడంలో సామాన్య ప్రేక్షకునికి అర్థమయ్యేటంత వివరంగా చిత్రించారు.

నటీనటుల్లో శ్రీరంజని అద్భుతంగా నటించింది. అమరనాగ్, మోహన్, మిక్కిలినేని వారివారి పాత్రలను చక్కగా పోషించారు. మిక్కిలినేని వేషధారణలో కొంచెం శ్రద్ధతీసుకుంటే బాగుండేది. రాజా, సుధా సంభాషణలు ప్రేక్షకులను వుత్తేజపర్చాయి. కథ అక్కడనుంచే రక్తికట్టిందికూడా. రేలంగి చక్కగా నటించినా ఆయనకు చాలినంత పాత్ర లేదు. పద్మినిని స్టారు కాస్టుకోసం పెట్టినట్లు స్పష్టంగా కనబడుతూవుంది. ఏమైనా చిత్రం అసభ్య ఘట్టాలుగాని, అతుకులుగాని లేకుండా చూచినంతసేపూ ప్రేక్షకులను ఎక్కడా విసిగించలేదు. చిత్రం జయప్రదమయింది.

ఆర్. కే. మూర్తి,

—సూళ్లూరుపేట.

* * *

# సినిమా వార్తలు

గోకుల్ పిక్చర్సువారు "వదినెగారి గాజులు" చిత్రంలో దాదాపు రెండురీళ్లు పూర్తిచేసి మరొక సెట్ మీద షూటింగ్ జరుపుతున్నారు. షూటింగ్ వీనస్ స్టూడియో (మాజీ శోభనాచల)లో వీరవరసింహులు సెట్ మీద జరుగుతోంది. వీరవరసింహులుగా సి. హెచ్. కుటుంబరావు నటిస్తున్నాడు. ఈయన భార్యగా ఛాయాదేవి, ఆమె కూతురు ప్రభగా జమున నటిస్తున్నారు. అంజలీదేవి, చలం, అమరనాథ్, మున్నగువారుకూడా ఈ చిత్రంలో ఉన్నారు. సంగీతం ఘంటసాల రచిస్తున్నారు. మాటలు, పాటలు అనిసెట్టి, పినిసెట్టి వ్రాస్తున్నారు. దర్శకుడు రజనీకాంత్.

ఈ చిత్రానికి ఒక మరాఠీ చిత్రం ఆధారం. కరుణరసప్రధానమైన కథ అనీ, ప్రేక్షకుల హృదయాలను కదిలించే సన్నివేశాలుగల కథ అనీ తెలుస్తోంది.

* * *

డిసెంబరు నెలలో విడుదలకాగల చిత్రాలపేర్లు చాలా వినిపిస్తున్నాయి. అశ్వరాజ్ వారి "అన్నదాత" విడుదల కానున్నది. భరణీవారి "విప్రనారాయణ" ఈ నెల పదోతేదీన విడుదల అవుతుందట. ఆ తర్వాత వాహినీవారి "బంగారు పాప" విడుదలవుతుందట. రాగిణీవారి స్వయంసిద్ధ చిత్రం, ప్రకాష్‌వారి "అంతే కావాలి"



గోకుల్ పిక్చర్సువారి "వదినెగాజులు" సెట్ మీద ఛాయాదేవి, కుటుంబరావు, డైరెక్టర్ రజనీకాంత్.

కూడా డిసెంబరులోనే విడుదల కావచ్చును. విజయావారు "మిస్సియమ్మ" తమిళ చిత్రాన్ని జనవరిలో విడుదలచేసి తెలుగు చిత్రాన్ని తరవాత ఎప్పుడో విడుదల చేస్తారని తెలుస్తోంది.

*　　　*　　　*

వినోదావారు తీస్తున్న "కన్యాశుల్కం" చిత్రం తాలూకు లుబ్ధావధాన్లుసెట్ మీద షూటింగ్ ఇటీవలనే ముగిసింది. ఈ సెట్ మీద సూర్యకాంతం (మీనాక్షి) గోవిందరాజుల సుబ్బారావు (లుబ్ధావధాన్లు) సి. ఎస్. ఆర్. (రామప్ప) వంగర, గౌరీపతిశాస్త్రి, అడ్డాల నారాయణరావు మున్నగువారు పనిచేశారు. షూటింగ్ వర్హినీ స్టూడియోస్‌లో జరిగింది. త్వరలో మరొక సెట్ వేయనున్నారు. పి. పుల్లయ్యగారు దర్శకత్వం వహిస్తున్నారు.

*　　　*　　　*

రాజరాజేశ్వరీవారి "సక్కుబాయి" షూటింగ్ జెమినీలో చురుగ్గా సాగుతున్నట్లు తెలుస్తోంది. ఇందులో సి. ఎస్. ఆర్., కన్నాంబ, ఎస్. వరలక్ష్మి మున్నగువారు నటిస్తున్నారు.

*　　　*　　　*

జూపిటర్ పిక్చర్స్‌వారు కైలైకారి చిత్రాన్ని తెలుగు, హిందీలలో పునర్నిర్మిస్తున్నారు. తెలుగులో ఇంకా పేరు పెట్టలేదు. హిందీలో పేరు "నయా ఆద్మీ." నవంబరు 22 న హిందీ చిత్రానికిగాను ఒక పాటను రికార్డుచేశారు. ప్రముఖ ప్లేబాక్ గాయకుడు రఫీ అహ్మద్ మద్రాసు వచ్చి ఆ పాట పాడి వెళ్ళిపోయాడు. ఆ పాటనే తెలుగులో పిఠాపురం నాగేశ్వరరావు పాడతాడని తెలుస్తోంది. ఈ చిత్రానికి దర్శకుడు దీక్షిత్; సంగీతదర్శకులు రామమూర్తి, విశ్వనాథంగార్లు. ఎన్. టి. రామారావు, అంజలీదేవి, జమున మున్నగువారు నటిస్తున్నారు.

*　　　*　　　*

విజయవాడలో ఇంగ్లీషుచిత్రాలు ప్రదర్శిస్తూవున్న లీలామహల్ యజమానులు 20 వేల రూపాయల ఖర్చుతో సినిమాస్కోప్ ప్రదర్శనపద్ధతిని ప్రవేశపెట్టారు. ప్రథమంగా ఫాక్స్ కంపెనీవారి "రోబ్" సినిమాస్కోప్ చిత్రాన్ని విడుదలచేశారు.

*　　　*　　　*

తెలుగులో అభ్యుదయ కవిత్వానికి ఒరవడి పెట్టినవారనిపించుకుని, ప్రస్తుతం సినిమా కవిత్వం వ్రాస్తున్న శ్రీరంగం శ్రీనివాసరావుగారు ఇటీవల స్టాక్‌హోం, ప్రపంచ శాంతిసంఘసమావేశంలో పాల్గొనే నిమిత్తం ప్రయాణమై వెళ్ళారు. డిసెంబరులో మాస్కోలో జరుగనున్న సోవియెట్ రచయితల మహాసభకు కూడా శ్రీశ్రీ హాజరవుతారట. ఆ తరువాత తూర్పు యూరప్ దేశాలు పర్యటిస్తారట.

మరొక భారతీయ రచయిత, సినిమా డైరెక్టరు, ప్రొడ్యూసరు అయిన కె. ఎ. అబ్బాస్ కూడా సోవియెట్ రచయితల సభకు హాజరవుతున్నాడు. ఆయన భారతీయ ఫిలింవర్గంతోపాటు తిరిగి రాకుండా ఆ సభకోసం అక్కడే ఉండిపోయాడు.



సినిమానటి ప్రమీల.



మ్రోడు

—ఫొటో: సి. వి. నారాయణమూర్తి, పెరవల్లి (గుంటూరు జిల్లా).



# నే నెప్పుడూ వండనంత అమిత రుచైన ఆహారము

## . . . అదెందువల్లో మొట్టమొదట నాకు తెలియదు!

ఒకనాడు భోజనాల వేళ మామూలుగానే ఉంది. మా ఆయన ఎప్పటిలాగ ఆలస్యమే రావడానికి. పిల్లలు కేకలు కరుక్కోడానికి దెబ్బలాడుచుండిరి. పాపాయి నిద్రమంచి లేచి ఏడ్చుచుయుండినది. ఆఖరుకు అంతా కూర్చున్నారు. అన్నం వడ్డించాను. అప్పుడు ఏం జరిగిందంటే: అసలు మొదటి ముద్దనుంచీ అల్లరి లేదు. పోటీలోలాగ మెదలకుండా తినేశారు. ఆ కుటుంబమేనా? అని ఆశ్చర్యపడ్డాను, ఏమి [illegible]గా చేశాను?

మా ఆయనకెప్పుడూ అసంతృప్తే ఆహార విషయంలో. పిల్లలూ తండ్రితోపాటు అల్లరే! భోజనానంతరం కూర్చుని ఆలోచించాను. ఆనాడు ఉదయం ఏం కొన్నానో బజార్లో: కాయగూరలా?...మార్పేమి లేదు. మాంసం, చేపలా? ... మామూలుగానే. అప్పుడు జ్ఞాపకం వచ్చింది. అదీ అసలైన మార్పు వంటలో! ఆనాడు, డాల్డా వనస్పతి డబ్బాను కొని [illegible] నిర్ణయించుకొన్నాను. మా దుకాణదారుడు అది వేపుడుకు, కాల్చుటకు, మిఠాయికి శ్రేష్ఠమైన వంట ద్రవ్యపదార్థమని సలహా ఇచ్చాడు. అతడు గాలి చొరని సీలు డబ్బాను నా చేతి కందిస్తూ, "ఇది ఆహారానికి కలిగించే సహజ రుచులను మీ కుటుంబం మెచ్చుకొంటారు" అని అన్నాడు.

అంతే: డాల్డా వనస్పతే తగిన మార్పును కలిగించింది. అది అన్ని వంటలకూ దివ్యమైనది. ఆహారానికి సహజ రుచులు కలిగిస్తుంది. వంటకు ద్రవ్యపదార్థాన్ని విడిగా బజార్లో కొనుట వల్ల మీ ఆరోగ్యానికి ప్రమాదమున్నదని జ్ఞాపకముంచు కొనండి. ఎక్కువ ఖరీదైన ద్రవ్యపదార్థములు కూడ కల్తీ చేయబడవచ్చును. లేదా: ఈగలు, దుమ్ము వల్ల చెడిపోతాయి. గాలిచొరని సీలు డబ్బాలోని డాల్డా వనస్పతి ఎల్లప్పుడూ తాజాది; పరిశుద్ధమైనది; ఆరోగ్యకరమైనది. మీరు మళ్లీ బజారుకు వెళ్లినపుడు కొనే సరకుల్లో డాల్డా ముఖ్యమైనదిగా నిర్ణయించుకొనండి. అందువల్ల ఎంత ఖర్చు తక్కువో!

10 పౌనులు, 5 పౌనులు, 2 పౌనులు, 1 పౌను మరియు ½ పౌను డబ్బాలలో దొరకుతుంది. డాల్డాలో ఇప్పుడు విటమినులు ఎ, డి వున్నాయి.

ఏది మీ కుటుంబానికి పుష్టికర ఆహారము?
ఉచిత సలహాకు ఇవ్వాళే క్రింది అడ్రసుకు వ్రాయండి:
ది డాల్డా అడ్వైసరీ సర్వీస్, పోస్ట్ బాక్సు నంబరు 353, బొంబాయి 1.




చెట్టుతోనున్న
డబ్బాకై చూడండి

# డాల్డా వనస్పతి

వంటకు దివ్యమైనది — ఖర్చు తక్కువ

HVM. 218-X46.93